# భారతీయ కవితా కల్పకం

విద్వాన్ విశ్వం

అన్నపూర్ణా పబ్లిషర్సు

ఏలూరు రోడ్డు : : విజయవాడ-2.

# విషయసూచిక

# భారతీయ కవితా కల్పకం

## అ స తో మా....

మాలిన్యమునుండి నన్ను
మంచివేపు నడిపించుము;
కాఱు చీకటిలో నుంచి
కాంతివేపు నడిపించుము;
చావునుండి అమృతత్వావు
చాయలకై నడిపింపుము.

వైదికం —బృహదారణ్యక - ఉపనిషత్తు

## నిదర్శనం

ప్రతిరూపము లేకయె,
యీ సతి సృష్టించుటకు
నలువ చాలియున్నచో
నితర మ్మేల ?
కళా పాండితిలో జగజెట్టి,
యాతడే యనవలదా ?

పౌరాణికం —పద్మపురాణం

## వ్యర్థము

పేదవాని వదాన్యత,
పేడివాని యస్త్ర నిపుణత,
విరసు డైనట్టివాని
వాక్ చమత్కృతి,
కవి గానివాని
శాస్త్ర పాండితియు,
నిష్ఫలమ్ములై పఱగుచుండు.

ఆలంకారికం —భామహుడు

## తపస్సు

అల నయోధ్యాపురీ
కల భామినుల మోము,
చెలువమ్ము నందుకొన
జలజమ్ము లెల్లన్,
కొలను నడుమను నీట
మొలబంటిగా నిలిచి,
కలకాలముగ దపము
సలుపున ట్లుండెన్.

లౌకికం —అమృతానందయోగి

## విరహంలో

విస మిముయు
మలయ పవనుని

దోసగుదన మ్మెల్లి
పుట్టుతో. వచ్చినదే;
అస లా చందన తరువుల
బుసకొట్టుచు,
పెద్ద సర్పములు
నెలవుండున్.

—ముక్తకం

## దయ

దిస మొలతో జడల దాల్చి
దిశాంతముల జరియించిన,
ఆకులతో, నారలతో
నంబరములు నేసికొన్న,
బూది, మన్ను, దుమ్ము వంటి
మీద పూత పూసుకొన్న,
బండలపై గుండ్లపైన
దిండు లేక పండుకొన్న,
మనసులోని మాలిన్యము
చనుట కెట్లు తోడుపడును ?
జీవుల వేధించక, జన
జేత యగుటకై ఏడ్వక,
లోకమ్మును దయతో నా
లోకించిన యపుడు గదా!

నీ మనస్సు నిర్మలమై
కోమలమై శాంతమగుట !

పాళీ —ధమ్మపదం

## వర్షాగమంలో....

హెచ్చు తగ్గు లెల్ల
చ చ్చదర మ్మయి
ఒక్క పురుగు లేని
ఒంటరి వయి,
ఇంతలోనె బాట లెల్లను—
కోర్కెలతోను గూడ
దాటరాని వగును.

ప్రాకృతం —సత్తసయీ

## అనురాగం

అగమ్య మైనది,
అనుపమ మైనది,
అమిత మైన దా
అనురాగాంబుధి,
దాని దాపులకు
దఱిసిన వా, డిక
ద్వంద్వ దుఃఖ జల
ధానము జేరడు.

హింధీ —రసభాలి

## అనేకుల కది!

క్రొ వ్విరులన్ గూర్చిన
నీ మవ్వపు మాలికను
కంఠమందు వైతువా ?
పువ్వుంబోణీ ! అగుచో
ని వ్విరి సరమునకు
బదులు నేనే మిత్తున్ ?
నే కట్టిన తోమాలను
నీ కొక్కర్తుకకె
యొసగ నెట్లు పొసగు !
నో రాకా హిమకరవదన !
అనేకుల కిది,
వారి నెల్ల నెటు వర్జింతున్,
ఉన్నారు భావుకులు;
మన కన్నుల కగపడని
చోట్ల గలవా రెవరో
ఉన్నారు;
కవుల పాటల
సన్నిహితులు - నున్నవారు
చాలమందియే.
ఇందరకై , యీ మాలిక
నందమ్ములు జిలుక గట్టినాడ;
కావునన్——

కుందసమరదన !
నీకే చెందించుట
యెట్లు పడును ?
చెప్పుము నీవే.
నీ యెడదకు
నా యెడద నుపాయనముగ
నడుగు సమయ మది
గతియించెన్;
తోయజ నయనా !
ఎపుడో పోయిన దా కాలమెల్ల
పూర్వగాథనై.
పరిమళ మంతయు
లోపలి యరలోనే
దాచుకొన్నయట్టి
మొగ్గతో సరియై,
నా జీవిత—
మొకపరి యుండెను—
పోయె నట్టి ప్రాప్తము
పడతీ !
ఉండిన తావిని
దిక్కుల నిండా
వెదజల్లి వేసి
నే నుంటిని;

ఏ పండితు డెఱుగును—
పోయిన దండి వలపు
మఱల చేర్చి, దాచు
మంత్రమున్.
సారస నయనా
నా హృన్నీ రేజాతమ్ము
నొకరి నెయ్యమ్మునకే
ధారాదత్తము సేయగ నేర !
ననేకులకు దాని
నియ్యగ వలయున్.

బెంగాలీ —రవీంద్రుడు

## కోరిగ

ఒక్క వర మిదియే
కోరుచున్న వాడ !
కొదమ తుమ్మెద గమి
రొద నదరిపోవు—
నీవు నివసించు కొండల
నెలవులందు
నేను చంపకమై
పుట్టనిమ్ము దేవ !

తమిళం — కురశేఖర పెరుమాళ్

## ఆ తామరలు

మొన లావులించి
వాసన సల్ల బసిగొని,
లే దేటి గము
లెంగిలింపకుండ—
నెడ సూఅగొని
వేచి సుడియు
తెమ్మెరలచే
బొడము పుప్పొడి
పొలి వోవకుండ—
ధరణి కూటమున
మే యెరలి పద్మిని మేన
మొలతెంచు
మధు మద మొలుకకుండ—
మేల్కని గోమిని
మెలగి మై మురిసిన
బొదిగొన్న యకరువు
సెదరకుండ—
దెలిసి జక్కవ
లొండొంటి గలయ
దారు కలకలంబున
రేకులు కదలకుండ—
మున్న కొనివచ్చి

గణికా సమూహి తోడ
వరదు బూజించె
పసిడి తామరల
గిరిజ—

తెలుగు —నన్నెచోడుడు

## మేల్కొల్పు

మేలుకొండీ జనుల్
మేలుకొండీ నరుల్
మన జీవ రక్షకుడు
చనుదెంచు చున్నాడు;
చీకటులు విచ్చినవి,
వేకువలు విరిసినవి,
రవివచ్చు మార్గమును
సవరించిన దుషస్సు.
ఎచట నన్నము దొఱకు
నచటి కేగుద మింక
మేల్కొనుడు! మేల్కొనుడు !
మేల్కొనుం డిక జనులు !

వైదికం —ఋగ్వేదం

## శ్రుతిదప్పిన వల్లకి....

ధూమ సంవృత
వహ్ని శిఖా మతల్లి రమణా,
నలిగిన పీతాంబరంబు

(2)

నొకటి గట్టుకొని యున్న
జానకీ కాంత, నంత
కన్గొనియె
నంజనాదేవి కన్నకొడుకు.

*　　*　　*

శారదాభ్ర పరీవృత
చంద్ర రేఖ,
వాడకము లేక
తంతులు వదిలి పోయి
శ్రుతిని దప్పిన వల్లకి—
సొరగి పోయి యున్న
జానకి,
నాంజనేయుండు
చూచె.

పౌరాణికం —వాల్మీకి.

## జిలుగు

వాచ్యభిన్నమై
మఱియొక సూచ్యమైన
వస్తు వుండు
మహాకవి వాక్యములను;
వెలికి కనిపించు
నవయవమ్ములకు
కట్టు వడని

వనితల జిలుగు
లావణ్యా మట్లు.

అలంకారికం —ధ్వన్యాలోకం

కాని....

తోడివారు రమ్మన్నారు,
తోనె తాను పోద మని
నిద్ర లేచెను.
పోయి తీరవలె నటన్న
కోర్కెయు గూడ గలదు—
కాని, యికను, పథికుడు
తట పటాయించుచుండె.

(ధ్వన్యాలోకంలో ఉదాహృతం) లౌకికం —ముక్తకం

మిటుకులాడి!

కోపించిన,
ననురాగము చూపించిన,
కంటనీరు తొలకించిన,
సల్లాపించిన—
చొక్కించు నదేపనిగా
మిటుకులాడి తెలివ
నీ మదిన్.

ప్రాకృతం —సత్తసయీ.

## లేదు...

వేదన పోలిక
హృదయోద్భేదన
మొనరించు నట్టి
పెద్ద వుండిలన్
లేదు మఱొక్కటి;
చెడు పని కాదని
వేఱొక్క నిశిత
కాండము కూడా !

పాళీ —ధమ్మపదం.

## మా కోనకు....

కడవ ముంచుకొనవలెనా ?
కలికి రమ్మ మా కోనకు॥
నీరు నీ పదాల చుట్టు
చేరి గుట్టు చెప్పగలవు,
సారసాక్షి ! వాన నీడ
లూరుచుండె సైకతముల॥
ఫాలమందు వ్రేలు కుంత
లాలవోలె మబ్బు తెల్ల.
నీలిచెట్ల కొమ్మల ను
య్యాల లూగుచున్నవి–నీ॥
నీ యడుగుల సవ్వడి చవి
నో యువిదా నే నెఱుగుదు,

నా యెడందలో నయ్యది
పాయక నినదించుచుండె.

కడవ ముంచుకొనవలెనా ?
కలికి రమ్ము మా కోనకు.
కాలహరణ కావలెనా ?
కాంత రమ్ము మా కోనకు॥
కడవ నీటిపైన వదలి
చడి చప్పుడుగాక యుండ.
గడపవచ్చు నీ కాలము
తడబడ నక్కర లేదిక॥

కసవు మొలిచె దరులలోన
పసరు మూసుకొని వచ్చెను
కొసరి కోయవచ్చు గగన
కుసుమమ్ముల నెన్నియైన॥
నీలి కనుల వల చీలిచి
ఓ లలనా తలపు పులుగు
లోలి యెగిరి పోవుచుండ
చాల సేపు గడపవచ్చు
కాలహరణ కావలెలా ?
కాంత రమ్ము మా కోనకు—

* * *

జలక మాడవలెనా ఓ
జలజాక్షీ రమ్మిచటికి॥

నీలి చీర విడిచివేసి
కూలమ్మననే యుంచుము
నీలి నీరు నిన్ను కప్పి
గోలా! దాచును లెమ్మా॥
అలలు కంఠమును తమ కౌ
గిలిలో బిగియంగ బట్టి
చెలియా! నీ చెవిలో మ
త్తిలి యాడును మంతనాలు
జలక మాడవలెనా ఓ
జలజాక్షీ ర మ్మిచటికి.
*    *    *
నీట మునిగి పోవలెనా ?
బోటి రమ్మ మా కోసకు॥
శీతలమ్మ నీ రిచ్చట,
లోతు కూడ చాలినంత,
నాతి! గాఢ నిద్రవోలె
నీ తిమిరము గ్రమ్మె నిచట;
కోన లోతు లోతులలో
చానా! రాత్రిం బవళ్లు
గానము మౌన మ్మొకటై
ధ్యానముద్ర భాసిల్లును.
నీట మునిగి పోవలెనా ?
బోటి రమ్మ మా కోసకు॥

బెంగాలీ —రవీంద్రుడు.

## రాసక్రీడ

వచ్చె వసంతోన్మేషము
సచ్చరితుల సంతోషము,
మంద పవన సంవాహము
మదన బాణ సన్నాహము.
వనలక్ష్మి మ్రొగ్గెత్తి వసుదేవసుతుని
చనవున నిట్టు లాహ్వానించె నపుడు...
"పది దిక్కులును కొత్త
పచ్చడమ్ములు గట్టె,
పద్మనాభా యిట్లు
పరికింపుమా !
పంచబాణుడు నిన్ను
పరిరంభ మొనరించు
పరమాత్మ ! దయచేసి
పఱతెంచుమా !"
ఆ పిలుపువిని యశోదాత్మజుం డడవి
గోప బాలకులతో గూడి యేతెంచె
కుంభస్తన భారముతో
సంభోరుహ నేత్రలెల్ల
నా ప్రభుతోనన్
దంభోళి కామశర సం
రంభ భయత్రస్తలై
త్వరం పడిరాగన్.

నూపురమ్ములు మొఱసె గలగల
భూషణమ్ములు మెఱసె తళతళ
జడల పాములు పొరలె మిలమిల
పెదవి పగడాల్ తెరలె కలకల.

రాస క్రీడా పరవశలై గో
పీ సుమ గాత్రలు ప్రోడల్
వాసుదేవుడే వేణువు నూదగ
చేసిరి నృత్య క్రీడల్.

కర మృణాలముల
బిర బిర నూపుచు
తరళ లోచనలు
తై తై
తధి గిణ తోం తక
తత్తా ధి త్తని
తై తక త్రొక్కిరి
సై సై.

అప్పుడు:
తారకల లోన చంద్రుని
తీరున గోపికల నడుమ
తేజరిల్లె రా
ధా రమణుడు; గంధవహ
ప్రేరితమై చేతు లెత్తె
ప్రేమాటవియున్.

గుజరాతీ —సోమసుందరలాల్.

## ఉ షః క న్య

అనారతము రోదసినే
అవలోకించుచు నుదయ
మ్మయి సర్వము వ్యాపించే
అతివ ఈమె ఉషఃకన్య.
ఉదయమ్మైన మంజుల వ
ర్ణోజ్వలాంబరము ధరించి,
ఉన్నతురాలీమె వెడలు
చున్నదదో కనుంగొనుము.
బంగరు పూతలతో నా
అంగన అందరి హృదయము
పొంగించుచు వారిలోన
రంగళించు జీవరసము.

వైదికం—ఋగ్వేదం

## నా ర దు డు

కారుమబ్బుల క్రింద
కప్పురపు రాశివలె
కదలి ఏతెంచు నా
రదుడు కన్పట్టెడిన్;
కర్రి ఏనుగుతోలు
కప్పుకొని నటరాజు

వెఱ్ఱినాట్యము సేయు
వినువీథి నోయనన్.

సంస్కృతం — శిశుపాలవధం

## ఆనుకూల్యం

బెదరిపోవకుండ
సదయుడై పాముల
శివుడు నెట్టివైచి
చేయి బట్ట,
పెళ్ళినాడె తెలిసె;
పెరిమతో గౌరి కాపురము
జరుగు నంచు
పొలతుకలకు.

ప్రాకృతం — సత్తసయీ

## కాలహరణం

తినుచు తినుచు
యుగమ్ములే
గణన లేక
వెళ్ళిపోయె,
గాని బుద్ధి
ఏ మాత్ర
మ్మేని మారు
టయే లేదు.
ఇట్లు కాల
హారణమైన

నెట్లు? జీవు
లచేతనుల
వోలెనె యిక
అగుదురంచు
గోలవెట్టు
కబీ రెపుడు.

హిందీ—కబీర్

## ఏ లు కో

నా కాంత నిద్రచెడునే!
ఏకాంతమున నుండెనే!
నీ కొఱకె వీక్షించునే!
శోకమున కాంక్షించునే
నీ కలల మేలుకొనునే!
వేకారి నిను గోరునే.
ఈ కటికి లోకమ్మునన్,
చీకటుల బడద్రోయగన్,
నీ కెటుల మనసు కలుగున్,
లోకాల నేలగలవే!
ఈ కాంత నేల లేవే?

తమిళం—తిరుమంగై మన్నన్

## ద ం డు గ

అందమ్ము లేని యాడుది,
చందము లేనట్టి పెళ్ళి,
సరి, దొరికినదే
విందుగ తిను పెండ్లామును

ఎందుకు? లేకున్న
యప్పుడే మేలుకదా?

కన్నడం—సర్వజ్ఞమూర్తి

గజప్రార్థన

లావొక్కింతయు లేదు,
ధైర్యము విలోలంబయ్యె,
ప్రాణంబులున్ ఠావుల్ దప్పెను,
మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్,
శ్రమంబయ్యెడిన్.
నీవే తప్ప నితఃపరంబెఱుగ
మన్నింపం దగున్ దీనునిన్,
రావే ఈశ్వర, కావవే వరద,
సంరక్షించు భద్రాత్మకా!

తెలుగు—పోతన

అయ్యో!

కమల శంఖ చక్రాది
రేఖల జెలంగు
లోక కళ్యాణకరమైన
నీ కరమున,
కంకణము గట్టినా మాని,
కందమూలములను
ద్రవ్వేక, వనులలో
మలయుమంచు?
(కౌసల్య రాముతో....)

సంస్కృతం—భోజరాజు

## కోడలి పుణ్యం

మిసమిసల కోడలు,
ఇంటిలో మసలుచుండ
నేన్గుదంతాలు, పులితోళ్ళు
నెట్లు దొరుకు నయ్యా
మా యింట వర్తకుడా?
అటంచు వగచె
నత్తయ్యా వచ్చిన వానితోడ.

ప్రాకృతం — సత్తసయీ

## వినరే?

వట్టి భయముతో నందరు
వణకుచుందు,
రెందుకో ఒక్కరైన
యోచించలేరు;
వినరు నామాట సుంతైన,
చనుట యెట్లుమరి?
అనంత భయమ్ము లీ
మనుజులందు—

హిందీ — కబీర్

## నా యంతట నేను!

తోట దటి చెట్టుమాటున
తొలగి నిల్చినాడనే గాని,
నే నేమి యడుగలేదు.

కన్నులరవిచ్చి వేకువ
కదలుచుండె.
చలువ తెమ్మెఱ మెల్లన
సాగుచుండె,
మంచు చిన్కులతో
గుబాళించె గఱిక.
మఱ్ఱి మ్రానిక్రిందుగ జేరి
మగువ యొంటి నీవు
నవనీత మృదుల
పాణిద్వయమున
పాలు పిండుచునుంటి
వే జోలి లేక.
నేనుమాత్ర మింకను నట్లె
నిలిచియుంటి.
ఏను బల్లెత్తుమాట
వచించ లేదు:
పలికినది పొన్న పైనుండి
పక్షి యొకటి;
పల్లె బాటపై మావి
పూల్ చల్లుచుండె:
వరుసగా ఝుంకరించుచు
వచ్చె నళులు;
కొలనిగట్టున శివుని
కోయిలను దెరచినారు:

భక్తులు పాడుచున్నారు, పాట-
చెలియు, పాత్ర నంకమునందు
చేర్చిపట్టి

నీవు పాలను పిండుచున్నావు:
నేను నిల్చుకొనియుంటి
పట్టి గిన్నియను బట్టి:
తెఱవ నీ దఱికే
చనుదేఱలేదు.

మేల్కొనియె నింగి
గుడిగంట మ్రోతవలన;
విడిచిపెట్టిన పనుల
త్రొక్కుడుల జేసి,
దుమ్ము లేచుచునుండె
మార్గమ్ములందు;

కడవలను చంక నిడుకొని
కాంత లెల్ల వచ్చుచుండిరి
నదినుండి వరుసగట్టి;
గలగలా మ్రోయుచుండె
నీ కంకణములు,
నిండుచున్నది నీ
పాలకుండయెల్ల,
ఎండ ఎదుగుచు
నుండిన దెంతో,

కాని, తెలవ
నీ దరికే చనుదేర లేదు.

బెంగాలీ టాగూర్

## అ గ ప డ వే మ య్యా!

యుగములకు యుగములే
తగులబడిపోయినవి;
పగలు రాతిరి పిలిచి
అగడు పడితిమి మేము;
నగధీర! నీ వేమొ
నగుచు నిలుచున్నావు!
తగని ఖేదమ్ముతో
వగచుచుంటిమి మేము.
తెగలేదు సందియము
సాగయుచుంటిమి తండ్రి!
అగపడదు మా కింక
నిగమ నుత నీ రూపు—
యుగములకు యుగములే
తగులబడిపోయినవి.

తమిళం—పొయ్గై ఆళ్వార్

## బూ డి ద లో...

సున్నమే లేని తములము,
సొగసుగుల్కు రంగులే
లేని పెళ్ళి,
సారంగనయన

లేని యట్టి సంసారము—
లివ్వి యిసుక బోసినట్టి
నూనియ
సఃపోవుగాదె

కన్నడం—సర్వజ్ఞుడు

ప్రసాధన క్రియ

శృంగార రాజ్యలక్ష్మికి
ముడిగలిసిన గతి,
హంస తిలకంబు
గబరి బూన్చి;
మరు రాజధానికి
మణివప్ర మిడు గతి,
గటి, నూత్నరత్న
మేఖల యొనర్చి;
ఎలదూడు
చక్రవాకులకు
మేపించినగతి,
హారలత
సన్నుగన నమర్చి;
సౌభాగ్య లావణ్య
సతుల దూన్చియ చూచు గతి,
గర్ణముల వసుఖచిత
కర్ణపూరములు వెట్టి;
తూగాడ బాలుతు లొండ్లు

నవయవంబుల కన్నంటి
కవయమైన
పసదనంబు నూల్కొల్పి,
భావమెసగ జేసి
రమకు శృంగారంబు
చెలువు మిగుల.

తెలుగు — నన్నెచోడుడు

## కాలవస్త్రం

నవలలు రాత్రింబవళ్ళు
కాలవస్త్రమును గట్టిగ
కలిసినేయుచున్నారు;
అపారమిది, అనంతమిది
ఆరు గడులతో నున్నది —
అటు వేసే పడుగు పొడవు,
ఇటు వేసే పేక పొట్టి.
అటు యిటు నేసినదే యీ
అమలము కాలంబరమ్ము.

వైదికం — యజుర్వేదం

## మసకగా

భాను సంక్రాంత
సౌభాగ్య భాసురమ్ము,
చంద్రబింబము
నీహార సంవృతమయి,
ఊరుపులు తాకి
గుడ్డియై యున్న

అద్దమట్లు జూపట్టె
మబ్బుగా
నాకసమున.

సంస్కృతం—వాల్మీకి

## అందం

పొగరు మబ్బులు
చెలరేగ
గగనమందు;
నీటి జాలున
వెల్లనై నెగడె
కడిమి చెట్లు;
కావున,
రాత్రుల చీకటైన,
గుడ్డివెన్నెలయైన
బాగుగనె యుండె.

ప్రాకృతం—ధ్వన్యాలోకంలో ఉదాహృతం

## ఎందుకివన్నీ!

తీర్థాలలో జలము
తేఱలుచుండునుగాని,
మునిగి పొందినదేమి
మనకు కనబడదూ॥
ప్రతిమలెల్లను జడత
ప్రార్థించుటయెగాని,

పిలిచి. పిలిపించుకో
గలుగుటే కనబడదు॥
మన పురాణాలు,
కురాను లేమో చెప్పా
గాని, మాయను జీల్చు
టేనాడు కనపడదు॥
స్వానుభవమున చెప్పి
నాను, వట్టి వివెల్ల;
కానిపించిన దేమి
కనబడదు నాకూ—
కనబడదు నాకూ.

హిందీ — కబీర్

వా ని క దు గో!

పూలదండ కూర్చుటకీ
ప్రొద్దంతా కూరుచుంటి,
పూలు జారి జారిపోవు
పోలతి యెందుకో॥
అచట నీవు కూరుచుండి,
ఆసక్తిని కనుగొమ్మల
నాలోకించుచు నుంటివి
అతి గుప్తముగా॥
చీకటి కుట్రలు పన్నె
నీకన్నులనే యడుగుమ—
ఊరళ వళ పాటులోన

నెవరిది తప్పో॥
పాటపాడ మొదలిడినా
పాటరాదు, నీపెదవుల
పయి తొలకే దొంగనవ్వు
నడుగు మొందుకో॥
నీ నవ్వుల పెదవులే ప్ర
మాణముగా చెప్పనిమ్మ,
గానము మౌనములోనే
కలిసిపోవు టెందుకో?
పూలదండకూర్చుటకీ
ప్రొద్దంతా కూరుచుంటి
పూలు జారి జారిపోవు
పొలతి యెందుకో!

బెంగాలీ—టాగూర్

## తలుపు తెరువు!

తెరువుమోయి నీ
మంగళ మందిర
పరమ ద్వారము
మాధవా—
కరము ఘోరమీ
జీవితవనమును
సరగున నెట్లో
దాటివచ్చితిని॥
ద్వారబంధమును

దవిలి నిల్చి నీ
యోర నిల్చితిని
దయామయా,
ఆరని జ్యోతిని
వెల్గించితి విక
ఏరా అక్కున
నన్ను జేర్చరా॥
నీ నామస్మర
ణే జపమైనది
నీ నిసుగును లా
లింపవా,
నీ నిత్యత్వము
దివ్యత్వమ్మును
నేను కోరి వ
చ్చితి దేవా॥
నీ ప్రేమామృత
రసమును స్వామీ
నాపై కురిపిం
చ వదేమీ?
ఈ పడిగాపులు
పడెడు భక్తు నిక
నీ పజ్జకు జే
ర్పుము స్వామీ—
తెరువు మోయి నీ

మంగళ మందిర
పరమ ద్వారము
మాధవా.

గుజరాతీ — దయారామ్

బాధలు

భాధామయ
పాన పాత్ర
ప్రభో నాకు
ప్రాప్తించెను.

పిపాసినై
వేడుచుంటి
వేదననే
అందించుము.

ఎంతతిట్టి
ఏడ్పించిన,
యింత నిసువు
విడుచునా?

తన తల్లిని
తరచి తరచి
తన్మయుడై,
అడగడా?

తమిళం — కులశేఖర పెరుమాళ్

## అ ం తు తె లి య దు

అంబుధి సం
గీతమ్ము, న
నంతాకా
శస్వరూప
మా శంభుని
మహిమను, శీ
తాంశు ముఖుల
హృదయమ్మును—
అంతు కను
క్కొన్న దెవ్వ
రయ్యా సర్వజ్ఞా.

కన్నడం—సర్వజ్ఞమూర్తి

## చ ం ద్ర ఖ ం డ ం

స్ఫురిత ప్రవాళ
లతికా త్యరుణ ద్యుతి
దెగడు మృదు
జటా టవిలోనన్—
కరమొప్పె జంద్రఖండం,
బరుణాంబుజ
వనము నడిమి
హంసియ వోలెన్

తెలుగు—నన్నెచోడుడు

## వర్షం - వనితా

ఎంత వేదన నాకు నెలతా
ఎంత వేదన నాకు చెలతా॥
జోరుమను వానలో
శూన్యకుటిలో జేరి
భాద్రపదమున నొంటి
బాధపడుచుంటినే ॥ఎంత॥

పర్జన్యఘోషలకు
పగిలిపోవును గుండె,
పుడమియెల్లను నీరు
పొరలిపోతున్నదే ॥ఎంత॥

దూరదేశాల పం
దురుచుండె నా ప్రియుడు
తపియించు చుంటినే
దర్పకుని బాణాల ॥ఎంత॥

నెమలి గుంపులు మనసు
తిమిరేక్క నర్తించె
అదొ° బలాకిక రాగ
మాలాసనము సేసె ॥ఎంత॥

ఎంత చక్కటి రేయి
ఎంత చీకటి గోయి
ఏమిటో యీ మెఱపు
లింత వుడికించునే

ఎంత వేదవ నాకు నెలతా
ఎంతవేదురు నాకు మెలతా॥

బెంగాలీ—విద్యాపతి

## మరుత్తులారా!

ఓ మరుత్తులారా ఓ
హో మరుత్తులారా!
మీ కదలిక సీటికి రుచి,
మీ కదలిక వనస్పతుల
మిసమిస లోలికించుచుండు;
మీరు చూపవలె మా కొక
దారిని మారుతము లార ?
ఓ మరుత్తులారా! ఓ
హో మరుత్తులారా!

* * *

మీరు వానకురిపించిన
సారవంతమగు భూములు,
సస్యవంతమగు నేలలు.
శక్తివంతు లగుదురు మా
సర్వ మానవాళి నిజం
ఓ మరుత్తులారా! ఓ
హో మరుత్తులారా!

* * *

కురిపించండీ వర్షం,
ధరణిని మొలిపించండీ,
సరిత్తులను పారించండీ.
మీ తాకిడితో మబ్బులు
మీ ధ్వానంతో దబ్బున
మిగుల జలము వర్షించును
మేలిమి కూతురు, మాతా
పితరుల మురిపించి బహూ
కృతులను కురిపించుగదా
ఓ మరుత్తులారా! ఓ
హో మరుత్తులారా !!

*   *   *

వర్షపూర్వకమ్మగు ది
వ్య ప్రభంజ నార్భటి మా
పాలిటి బంగారు పంట:
వంటజేసి వడ్డించే
వనితవోలె, మానవ భో
జనదాయిని యగునుగదా
ఓ మరుత్తులారా! ఓ
హో మరుత్తులారా!

వైదికం—అథర్వవేదం

## తేజస్వి

ఒరుల కుపకరింప
సరగున శిక్షింప
గలుగువాడె
శక్తి గలుగువాడు:
రేయి వెలుగ నిచ్చు రేరేని:
పగలేమొ సాగయు జేయుచుండు–
సూర్యదేవుడు

సంస్కృతం—రత్నాకరుని హరవిజయం

## వట్టిచూపులు

ఆపరాని పిపాసతో అతని నెంతసేపు
జూచిన దనివి
కాసింత తీరదు:
అత్త! కలలోన
దప్పిక నణచుకొనగ
జూచు తర్వాంగివలె
వట్టి చూపులయ్యె

ప్రాకృతం—సత్తసయీ

## స్వచ్ఛప్రేమ

మిత్రులందు,
నిజ కళత్రమందును,
బంధు పుత్రులందు
ప్రేమ పుట్టివచ్చు

సహజ మద్ది;
కాని, స్వచ్ఛమౌ ప్రేమకు
చుట్టుపక్కములను
చూపు లేదు.

హిందీ — రసఖాని

## పైకి ...

రెక్కలు లేకుంటే మరి
ఎక్కడికి కెగురవు పక్షులు;
రెక్కలు లేకున్నా మీ
రెక్కడికైనా ఎగిరే
ఒక్క ఉపాయం చెబుతా;
చుక్కలలో కెగురవచ్చు
చిక్కని తలపులతోనే —
తక్కిన వెందుకు పాపా!

గుజరాతీ — గాంధీజీ

## అపుడు - ఇపుడు

కనులెత్తి చూడు మంగన
యంచు నాత డన్న,
ఛీ కొట్టి పొమ్మంటిని గాని
కదలలే దొక్కింత గాని,
పైపెచ్చు నా ముందునకువచ్చి
నా కరద్వయము పట్టుకోగా,

కోపపరవశ నగుచు
వదిలివేయు మటంచు
విదిలించినాను;
కాని ఆత డొకింత
కదలనే లేదు.
తన మోము నా చెవి
దరికి రానిచ్చి,
ఏమిటో చెప్పబోయిన
సిగ్గులేని చేత లివేమని
చీదరించితిని.
ఏమైన నతడు
చలించనే లేదు.

* * *

నా చెంపలకు సోకినవి
అతగాని పెదవులు;
సంభ్రమాన్విత నయిపోయి
తగదు సాహసమని
దండించినాను,
కాని ఆతనికి
సిగ్గన్నది లేదు.

* * *

ఆత నొక సుమము
తనంతట దెచ్చి

తలలో నమర్చి,
నిదంతయు వట్టి
జతనము.
నిష్ప్రయోజనమని యంటి:
నైనను కదల లే
దా వగకాడు.

✻ ✻ ✻

అటు నిటు జూచి,
కాసంత సేపాగి
అతగాడు, నా కంఠ
మందున్న పూలమాల
తీసుకొని, ఏ మనకుండ
నెటకో వెడలిపోయెను
నన్ను విడిచి ఓ సకియ!

✻ ✻ ✻

ఇపుడు నే నిట
నిశ్వసించుచు, నొంటిగా
గూరుచుండి ఏకాంతమ్మునందు.
అనుకొను చుంటి
ఆయన యేల తిరిగి రాడు
నా దగ్గకంచు...

బెంగాలీ—టాగూర్

## సముద్ర ఘోష

ఎందుకంత కళవళపడి
ఎగిరి ఎగిరి పడతావు?
ఎందుకంత నురుగు గ్రక్కి
ఇంత రొప్పుతావు?
ఎందు కలా రేయి పవలు
మేల్కొని బొబ్బలిడుతావు?
ఎందుకోసమైనా నీ
విటు తపించుచున్నావా?
ఎవరి కోసమైనా, ఆ
శించి ఆర్చుచున్నావా ?
ఇంతా నా వంటి దాని
వేనా మరి సంద్రమా?

తమిళం—నమ్మాళ్వార్

## ఎవరు ?

కామినీ కాంచనమ్ముల,
క్రమ ఫల భరావనత
పాదపముల
గన్నార గాంచి,
మనసునం దాసపడనట్టి
మాన్యు లెవరు?
అంచు సర్వజ్ఞమూర్తి
ప్రశ్నించినాడు.

కన్నడం—సర్వజ్ఞ

## అద్భుతం

కలయో! వైష్ణవ మాయయో!
ఇతర సంకల్పార్థమో!
సత్యమో!
తలపన్నేరక యున్నదానను;
యశోదాదేవి గానో!
పరస్థలమో!
బాలకు డెంత;
యీతని ముఖస్థమై
యజాండంబు ప్ర
జ్వలనం బందగ
నేమి హేతువో
మహాశ్చర్యంబు చింతింపగన్

తెలుగు — పోతన

## ఆరణ్యకం

ఓ వనీ ఓ వనీ
ఓ అరణ్యాని,
దారి తప్పిన
బాటసారి చందమున
దిగులుగా నుంటి
వదేమిటి జననీ?
అందరివలె దారి
వడుగ వెందులకు?

ఒంటిగా భీతి
జనించదా నీకు?
వాన వచ్చెను,
పక్షి భావ మెగ్గెత్తి
అరచెను;
మిగతవి సరగున బలికె.
గాయకు లెందరో
కలిసి వాద్యముల
గళము గల్పిన యట్టి
గానమ్ము చెవుల
విని చొక్కిపోయి
నిల్చొని యుంటివేమొ!

*　*　*

ఊరి బయళ్ళలో
నున్నట్లె,
యిచట చేరిన పసులు
పచ్చిక మేయుచుండె;
ఊరి వీథులవలె,
నున్న విచ్చటను
పొదరిళ్ళ వరుస
సొంపులు దిద్దుకొనుచు;
చీకటి పడగనే
నీ కష్ట ఫలము

చల్లగా యింటికి
సాగింతువేమి?

* * *

ఆవుల పిలుచు చున్నారు
గోపకులు.
కొట్టుచున్నారు
మ్రాకులను తక్షకులు,
ప్రొద్దువోయిన
నొక్క త్రోవరి వచ్చి
పాదపస్థలి జేరి
పడుకొని,
పక్షి రవరూపమైన
నీ రమ్య సంగీతమును విని,
తన్మయతను నాచికొనును,
ఒరులకు నపకార
మొనరించి యెరుగ
నట్టి దానవు;
ఒక్క యాటవికుండు
నిచ్చట నిన్
పల్కరించకయున్న
బెంబేలు పడిపోని
బిత్తరి వీవు;
కమ్మని నీదు

ఫలమ్ములఁ దినుచు
హాయిగా జీవింప
నగు వేయి యేండ్లు

* * *

కమ్మతావుల
విరజిమ్మెదు వీవు.
కర్షక శ్రమకు
అక్కరయె లేదిచట;
కలమ ధాన్యములతో
తులతూగుచుండు
నో వనీ ఓ జననీ
వనరాణి
నీ వెంత గొప్పదానివి;
తల్లి యిదిగో చేకొమ్ము
నా నమస్కృతి సహస్రమ్ము—

వైదికం—కృష్ణయజుర్వేదం

## నిగ్రహం

ఎంత కలత పడిన నేమి?
ధీరుల చిత్త మెంతో
నిర్మలముగ నెసగుచుండు;
గాలివాన యెంతగా
చెలరేగిన

జలధి బురదరేగ
మలిన మగునె?

సంస్కృతం — భారవి

## మనసులో ....

ఆమె నీకయి
కృశియించె నని తలంచి,
'ఏల చిక్కితివంచు'
ప్రశ్నింతు వేల?
'సహజమే నాకు
వేసవి సన్నవడుట'
అని జవాబిచ్చు
నా సుందరాంగి సఖుడ!

ప్రాకృతం - సత్తసయీ

## ప్రేమపరాకాష్ఠ

జగతి సర్వవస్తు
సంచయమ్ముకన్న కంటె
తనువు మీద మనకు
తగనిమమత.
తనువు, ధనము
ప్రాణమున కంటె
ప్రేమయే యెక్కువైన దని
వచింతు నేను

హిందీ - రసఖాని

## చీ క టీ !

సాయంతనమ్మైన
శాంతి యేర్పడును,
హసియించు క్షణము
సంధ్యా దేవి యంచు
తలచితి; కోయిల
పలుకు నటంచు,
గాయమ్ము మాని పో
గల దంచు.
హృదయసఖి
భయంకర వార్ధి
సమసిపో వీధి గట్టుపై
వ్రాలగా గలదంచు—
దలచుకొంటి:
నా కోర్కె చేకూరనే లేదు,
హత విధి అట్టహాస
తమస్సు మాత్ర
మలముకొన్నది
దిశా వలయమ్ము నెల్ల.

గుజరాతీ - బలవంతరాయ్ కల్యాణరాయి ఠాకూర్

## రెక్కలు పుట్టినవా?

గిరులతో నెక్కు,
మబ్బుల సరస దిరుగు.
అలల నర్తించు,
పూవుల నవ్వులాడు.
చీకటుల జేరి కల గాంచు
చిలిపి మనసు,
వలపు పిలుపున
రెక్కలు మొలిచె నేమొ!

తమిళం - నమ్మాళ్వార్

## విరహిని

చెలిమి నా పేర రచించిన
కృతిని పాడుటకై
అంకపాళిని మాసిపోయిన
చీరెపై పొలతి,
విపంచి నునిచి,
కన్నీరు దోగిన తంతు
లెట్లో సారించి,
తన రాగ సరళినే
తాను సారెసారెకును
విస్మరియించి
వగచుచుండు గావలయు

నోహో జలదాతః

సంస్కృతం - కాళిదాసు

## ఒరులకే

విద్యయున్నను, లేకున్న
విఱ్ఱవీగి
తనకు మించినవాడు
లేడని తలంచు నతడు.
దివ్వియ చేగొన్న
అంధు డగును:
కాంతి యొరులకు,
తన కంధకార మొకటె.

పాళీ - ధమ్మపదం

## శుద్ధప్రేమ

గుణమునకు,
రూపమునకు,
జవ్వనమునకును,
ధనమునకుగూడ
వలపులో తావు లేదు;
కామనయె లేని
నిర్మల ప్రేమ,
సకల సౌఖ్యములకెల్ల
నిలయమై చనునుగాదె.

హిందీ - రసఖాని

## బ్రహ్మజ్ఞానం

నామధారణ సేసి,
నడయాడినాను;
ఉరముపై తులసి పే
ర్లరిగి పోయినవి;
యాత్రల కాళ్ళు
కాయలు గాచిపోయె;
ఇంకను హరి
సమీపించనేలేదు,
పెద్ద పురాణాలు
విని, విని చెవులు
చిల్లులువడె గాని,
చేకూరలేదు నాకు
బ్రహ్మజ్ఞాన
మీ కానలోన.

గుజరాతీ - అఖా భగత్

## చెప్పలేక....

ప్రక్కనున్నట్టి
దీప మ్మారిపోయె,
ఖగకూజితముల
మేల్కాంటి వేకువను,
విడిపూవు లటు నిటు

జడనుండి జార
ఆగవాక్షము జేరి
యచట కూర్చుంటి;
అరుణప్రభాత
ధూసరిత మార్గమున
నొక యువపాంథు
డెటోవచ్చి నిలచె.
కంఠమ్ములోన
ముక్తాహారముండె.
మకుటమ్మురవి కర
వికసితమ్మయ్యె.
మా గృహ ప్రాంగణ
మ్మందున నిలచి,
ఆమె యేదని
యాత డడిగెను గాని,
నేనె ఆమెను పాంథుడా
నేనె ఆమె
నని చెప్పలేకపోతిని
సిగ్గు వలన.
సంజచీకటి, దివ్వె
సరిచేయలేదు,
తలదువ్వుకొనుచు
నంతట గూరుచుంటి,



సంధ్యాతపమ్ముననె
స్యందనమ్మెక్కి—
తిరిగి యీ నవపాంథు
డరుదెంచినాడు.
నుగుగు గక్కుచునుండె
మరి రథాశ్వములు,
ధూసరితము లయ్యె
దుస్తు లన్నియును.
అలతతో ఆమె యేదని
ఆత డడిగె.
అలసిపోయిన పాంథుడా
ఆమె నేనె యని
చెప్పలేకపోతిని
సిగ్గువలన.
అది వసంతోన్మత్త మైనట్టిరాత్రి.
గదిని దివ్వియ
ప్రకాంచుచు నుండె;
మెల్లన పిల్లతెమ్మెఱ
వీచుచుండె.
నెఱవాది రాచిల్క
నిదురించుచుండె.
నెమలిపించముపోలు
కొమరారు

పావడా గట్టుకొని,
పచ్చ నాకు పయ్యెదను
పైకె వేసికొని
గవాక్షమున గూర్చుండి
జనహీనమైన
వీథిని జూచు చుంటి;
ఆ రాత్రియంతయు
నా తిమిరమున
ఆమెనే నే
నో నిరాశాహతుండ;
ఆమెనే పాంథుడా
ఆమెను నేనె
అనుచు నాలో నేన
గొణుగుచుచునుంటి.

బెంగాలీ - టాగూర్

ఆ మో వి

అతని పగడపుమోవి
నుతియించవే
ఆలకించుటకు నే
నారాటపడుచుంటి!
అదిపచ్చకర్పూర
మటు పరిమళించునా?
అదిఫుల్లకల్హార

మటు గుబాళించునా?
అతని కెంబెదివి. స
న్నుతి సేయవే
ఆసపడుచుంటి నేః
నాలింప నియ్యవే.

తమిళం - ఆండాళ్

కార్యాపరితత్రత

ఊపిరుబికి మనుషులెల్ల
నొక్కుమ్మడి నడుంకట్టి
భద్రమ్ముల జూడదలచి
పనులకు దొరకొనిరీ—
మిలమిలలాడే మానవ
లలనవోలు నుషోదేవి
వెంటనంటి ఆదిత్యుడు
వెడలు చుండెనూ—

వైదికం - ఋగ్వేదం

కామి

చదువు లేమి వలన.
సజ్జనులగు వారి
చెలిమి లేమి వలన.
చెంగలించు
నింద్రియముల

నిగ్రహించెడు నేరుపు
లేమి వలన
మనిషి, కామి యగును.

సంస్కృతం - కావ్యాదర్శం

పాడకే!

ఓ మురళీ పాడకే
నా మది రగిలించకే॥
అతని మనసు గొనితి నంచు
అమ్మా రవళించకే
ఆర్త హృదయమును బాకుల
నదయత హింసించకే॥
ఆయన అధరామృతమ్ము
నంతా త్రాగేయకే
అలమటించు నా మనసున
ఆశపాడు చేయకే॥
అనదను నా నాథునికై
అటమటించు చుంటినే.
అన్యాయము సేయకే
ఆర్తురాలి చంపకే

ఓ మురళీ పాడకే
నా మది రగిలింపకే.

గుజరాతీ - దయారామ్

## అసంతృప్తి

ఎద జీల్చుకొని వచ్చి
యిగిరించు నా కోర్కె

మరు మరీచిక వోలె
పరుగెత్తు నెచటకో
గట్టి పట్టున నిల్వ
గా జూచితిని గాని,
తప్పించుకొని నన్ను
తప్పుదారిని బెట్టె;
ఆశించినది చేతి
కందుటలేదు—
చిక్కిన దానితో
తృప్తియు లేదు.

బెంగాలీ - టాగూర్

## సరసత

శాస్త్రములను చదివి
శాస్త్రి కావచ్చు,
కోరాను చదివి
మౌల్వి కావవచ్చు,
కాని, వలపు బలుపు
కానని వానికి.

హృదయమెట్లు
రససమృద్ధి గనును?

హిందీ - రసఖాని

## రసహృదయం

దిగంతాల గర్జించే
అగాధాలలో
జలజల సెలయేరు గుండె
జలదరించునూ.
నులివెచ్చని నీ కెండల
పలకరింపులో,
పుడమి బోడుచు పూవు రేకు
పులకరించునూ.
గాటమైన మృత్యుదేవి
కౌగిలింతలో,
కలకలమను జీవితమ్ము
కరగిపోవునూ.
వలపు లులుకు నీ తలపుల
కలవరింతలో,
సొమ్మసిల్లు నా యెడంద
సొక్కి పోవునూ

తమిళం - పొయ్ గై అళ్వార్

## గృహిణి

మగువ యొరులకు నెప్పుడు
మంచి సేయు,
తన్వి స్వర్గలోకమునకు
దారి జూపు,
ఉవిద సర్వకార్యముల
చేయూతనిచ్చు,
మెలత మునులకు మాత్రమె
మృత్యువగును.

కన్నడం - సర్వజ్ఞుడు

## నీతి

ఆకొన్న కూడె యమృతము,
తాకొంకక నిచ్చువాడె దాత,
ధరిత్రిన్ సోకోర్చువాడె
మనుజుడు,
తేకువ గలవాడె
వంశ తిలకుడు సుమతీ—

తెలుగు - బద్దెన

## డోలాయమానత

ఇటు జూడన్ రఘురాము,
డట్లుగన వాడే లక్ష్మణుం,
డింక నక్కట!
నెచ్చో దమదీర్చుకొందు

నని, రక్షః కాంత యల్లాడెః
నిట్టటుగూడన్
నునుపచ్చికం గని,
యిటట్టె, గట్టుపై, ధేను
వచ్చటి కిచ్చోటికి నూరకే
దిరుగు నోజన్
గంపిత స్వాంతయై.

సంస్కృతం—భోజరాజు

## మధుర భావన

నెమలి కేకలను వినివిని
నెమ్మది చిల్లులువడెనే,
చిలుక పాటలను వినివిని
చెవులు మూతవడెనే.
కోయిల కూతలు గాలిని
కోకోయని యనెనే.
మెఱపు మెఱసెనే, మబ్బులు
ఉఱుము లుఱిమి చనెనే
చిటచిట చినుకులు పడెనే
చీరచెఱగు తడిసెనే.
చిన్ని గోపబాలుని యీ
చిన్నెల నే మందునే—

గోపాలుడు నా హృదయము
కొల్లగొట్టి పోయెనే—

హిందీ — మీరా

దారి తప్పి....

పరిమళోన్మత్తమై
వనవీథి కస్తూరి
హరిణమ్మువోలె నే
పరువులిడుచున్నాను—
మధుమాసరాత్రి యిది
మలయానిలము వీచు
మార్గమ్ముదప్పి నే
మట్లాడుచున్నాను—

ఆశించినది చిక్క
కరుగుచునుండె
చిక్కినదాని నా
శించలేకుంటి.

బెంగాలీ — టాగూర్

కనులు

ఒక్క చూపులోనె
ఉన్నదంతయు
జూడ గల్గునపుడె వాని
కన్నులనుట.

కాకయున్న, నంగకములలో
తలమాని కమ్ములంచు
వాని గణన యెట్లు?

మోతాదు

తలచినప్పుడెల్ల
పొలయల్క జూపుట
తగదు సుమ్మి,
కొంత తాల్మివలయు;
అలుక ఉప్పు వంటి
దది యెక్కువైనచో
వంట యెల్ల పాడువడదె చెలియ?

తమిళం — కురళ్

ఇంతి

ఇంతియున్ననె యిహము
ఇంతియున్ననె పరము
ఇంతియున్నప్పుడే
ఎల్ల భాగ్యమ్ము
లింతి నొల్లనివార
లెక్కడున్నారు లే
ఇంతియే సర్వమని
యెంచె సర్వజ్ఞుండు.

కన్నడం — సర్వజ్ఞమూర్తి

## హారిసునా?

ప్రాంచద్భూషణ బాహుమూల
పాలిండ్లు పొంగార, రుచితో
పై యంచుల్ మోవగ
గౌఁగిలించి అధరం బాసింప,
హా శ్రీహరీ యంచున్
బ్రాహ్మణు డోర మోమిడి.
తదీయాంసద్వయం బంటి
పొమ్మంచుం ద్రోచె:
కలంచునే సతుల మాయల్
ధీరచిత్తంబులన్.

తెలుగు — పెద్దన

## అహోరాత్రులు

దివారాత్రముల కొకటే,
దివ్యపథం. అనంత మది
దివ్య సోదరీ మణులౌ
దివా నిశీథిను లిద్దరు,
తివిరి ఒకరి వెనుక నొకరు
పవలు రేలు తిరుగుచంద్రు:
అవిరతులై ఒక్క నిమిష
మాగని వేగమ్ముతో:
ఆకారా ల్వేరు గాని

ఆంతర్యాం ఏకైకం
ఆ రెంటికి, ఆ జంటకు.

వైదికం — అథర్వవేదం

## రాలినతార

వెలుగు దక్కి,
పెంట్రుకలు చిక్కువడి.
దుమ్ము వట్టియున్న సీత
వనరుచుండె
పూర్వ సుకృత మెల్ల
పాలిపోవ నేలపై
రాలి పడిన తారవోలె నపుడు.

సంస్కృతం — వాల్మీకి

## మురళి

తామర తూళ్ళను చేత బట్టుకొని
తాళ రాగముల సమన్వయంతో
తన్వంగులు నృత్యము చేస్తుంటే
తాండవ కృష్ణుని
మురళి మ్రోసినది.

గుజరాతీ — నతర్షి

## తీయరసము

"అరుదెంచు చుండె
సంధ్యాకాల మోకవీ
నెఱసిపోవుచు నుండె

నీ శిరస్సెల్లా
నీ రహో భావనా
నిశ్చల సమాధిలో
ఆలకించిన వాడవా?
బావి గతిని?"
"అవును సాయంకాల మయ్యె
నా పల్లె వారెవరైన
పిలుదురో యేమొ వినుచున్నాను.
వేళ మించిన గూడ వేచి
యున్నాను
యువ వియుక్తాత్మ
లిచ్చో యుక్తి నంది?
తమకమ్ము గుఱియు
నేత్ర ద్వంద్వములను,
మానముద్రను వీడి
మాటాడ లేక
గానమ్ము కోసమై
కాంక్షింతు రేమొ:
మృత్యువుం గూర్చి
యతీతమ్ము గూర్చి,
జీవితావధి జేరి చింతించు చున్న
ప్రేమ గీతా లల్లి పెట్టువా రెవరు?
అస్తమించినది సంధ్యా తార యప్పుడె

తలుపులు మూసి
యేతద్బంధ ముక్తికోసమై
యుండగా నాశింతునేని,
ఈ నిశీథిని పరికింప దలంచి—
ఈ తమస్వనము లాలింపదలంచి
గులు వీడి యిటకు
నేతెంచు నారలకు
వించువా రెవరు
జీవిత రహస్యముల?
తల తెల్లవడెనంచు
కలత లేమిటికి?
యువకులలో నెల్ల
యువకుడ నేను
వృద్ధులలో కెల్ల
వృద్ధుడ నేను—
చిఱునవ్వు తేనియల్
చిలికించువారు!
కళ లొల్కు నంచుల
కన్నులవారు,
బాష్పాంబు కణముల
ప్రకటించువారు,
వీరలెల్లరు
నన్నపేక్ష సేయుదురు;

తలుపులు మూసి
యేతద్బంధ ముక్తికోసమై
యుండగా నాశింతునేని,
ఈ నిశీథిని పరికింప దలంచి—
ఈ తమస్వనము లాలింపదలంచి
గులు వీడి యిటకు
నే తెంచు నారలకు
వించువా రెవరు
జీవిత రహస్యముల?
తల తెల్లవడెనంచు
కలత లేమిటికి?
యువకులలో నెల్ల
యువకుడ నేను
వృద్ధులలో కెల్ల
వృద్ధుడ నేను—
చిఱునవ్వు తేనియల్
చిలికించువారు!
కళ లొల్కు నంచుల
కన్నులవారు,
బాష్పాంబు కణముల
ప్రకటించువారు,
వీరలెల్లరు
నన్నపేక్ష సేయుదురు;



జీవితానంతర చింత
ఏమిటికి?
అందుకు సమయ
మూ వంతయు లేదు
నిత్యయౌవను తల
నెఱసిన నేమి?

బెంగాలీ — టాగూర్

## దావాగ్ని

పొదల దుప్పివలె చిత్రము,
ప్రొద్దువోలె సందృశ్యము.
పరమాయువు వడుపున జీ
వ రసాయన వరము;
అరణ్యమున కన్నకొడుకు
కరణి, ఆవు కడుపువోలె
పరుగులెత్తు దావాగ్నికి
కరాంజలిని ఘటియించెద.

వైదికం — ఋగ్వేదం

## కూటికై కోటివేషాలు

జడలు బెంచు,
గుండు సవరించు
వెంట్రుకల్ కత్తిరించు,
జడుడు, కావిగట్టు;

కనియు కాంచలేదు.
కడుపు కక్కుర్తికే
వేయి వేషములను
వేయుచుండు,

సంస్కృతం — శంకరాచార్య

## భూతదయ

నరుడు నూరేండ్లు బ్రదికి
ప్రాణమ్ము విడుచుదనుక
దేవతలకు బలిదాన
మిచ్చునంత కంటెను,
కరుణతో చెంతజేర్చి
ఒక్క జీవిని బ్రదికింప
నొందు సుఖము.

పాళీ - ధమ్మపదం

## తప్పంటే?

తప్పంటే ఏదో నీకు
తప్పక తెలియాలా మరి?
అయితే విను సావధాన
మైన మనసుతో మనిషీ—
పనికివచ్చు దాని నవల
పారవేయుటే తప్పు;
పనికిరాని దానికొరకు
ప్రాకులాటయే తప్పు.

తమిళం — కురళ్

## అవమానం

సమయ మెఱిగి వచ్చు
రమణి ముద్దులగుమ్మ,
వార్చినట్టి
జొన్న వంటకమ్ము,
మేలి గేదె పెరుగు
మీగడ దొరికిన
బసువురాలి
నడుగువా డెవండు?

కన్నడం — సర్వజ్ఞమూర్తి

## కాటుకబరిణ

తరుణ తర
శశిమండలాత్యరుణ రుచులు
గొడగు లెదగ్రుచ్చి
నడి నెత్తి కొనిన
సాంద్ర తిమిర పటలంబు
వోలు పారె
దీప దీప్తి పరివృతంబైన
కజ్జల పాత్ర పోలె

తెలుగు — నన్నెచోడుడు

చంద్రమా....

వాడి కొమ్ములతో నున్న
కోడెవోలె,
ఉచ్ఛశృంగమ్ము లను గల్గు
నుర్వీ ధరము పోల్కి
బంగరు పూతకొమ్ముల
మదేభ సరణి,
కొమ్ములుదీరి
చందురుడు వొలిచె.
కొండ నెక్కిన
సింగంపు కొదమ వోలె,
రణము జొచ్చిన మత్తేభ రాజుమట్లు,
రాజ్యమబ్బిన
రాజ సుతాము మాడ్కి
చదల వెలుగొందె నప్పుడు
చందమామ.

సంస్కృతం — వాల్మీకి రామాయణం

పొగరు

ముత్తెముల సరాల
మురువులు దాల్చిన
సవతు లందు,
తానె జాణ ననుచు
కురుల నెమలి పురిని

దురిమి, ఆ చెంచెత
గరువ ముట్టిపడగ
దిరుగుచుండె.

ప్రాకృతం - సత్తసయీ

## వట్టి ఎత్తు

సాధువునని, గగనమెత్తు
సాగి, కజ్జూరంపుజెట్టు
సరణి నిలిచియున్నందున
నొరుగునదేమీ?
పక్షులకా నీడ లేదు;
ఫలములన్న నందబోవు;
వట్టి యెత్తుతో నేమిటి
వచ్చును మనకూ!

హిందీ — కబీర్

## అర్థం లేని....

అర్థహీనమైన యట్టి
కీర్తన యేల?
వ్యర్థమగును సుమ్ము వట్టిపాట;
గార్ధభమ్ము గట్టిగా
నోండ్రపెట్టిన
అందులోను గూడ
నర్థముండు.

కన్నడం - సర్వజ్ఞుడు

## ఎండ

తలఁచిన డెందము గందును,
బలికిన నోరెల్ల బొక్కు—
బ్రభ సూచిన రెప్పలు గమరు,
ననగ, బటుతర—
విలయానల భాతి
నెండ, వేసవి గాచెన్.
ఉరు నిదాఘాతపాహతి,
గరుల తలలు వ్రస్సి,
లోపలి ముత్యముల్
వరుస మెఱసి,
మంగలములోని
ప్రేలాల భంగి దూలి,
ప్రేలిపడ గాసె
గట్టెండ పిడువరించి.

తెలుగు — నన్నెచోడుడు

## వేకువ రేకులు

చీకట్లను కప్పుతున్న
ఆకాశపు టంచుల. నా
లోకవిషయ మొహరించుచు
రేకులుగా విడుగుతోంది.
తన చెల్లెలు రేయి కన్న

కను గబగబ తెరుముతోంది:
మనుష్యుల యుగము, లోకొక్కటి
గను ముక్కలు చేస్తున్నది.
హృదయేశ్వరుడ దీప్తిచ్ఛట
మెదలుతోంది మిలమిలమని—
అదిగదిగో ఉషఃకన్య
ఉదయిస్తున్నది సఖుడా.

వైదికం— ఋగ్వేదం

## చల్లు వల తేరు

రజత పంజరమ్ములోని
రాజహంస పోలికన్,
మందరాద్రి కందరమున
మసలు సింహ మట్టులన్,
మత్త గజము పయినెక్కిన
మహారథుని చాడ్పునన్
మింటనున్న చందమామ
మెఱయుచుండె వెలుగులన్.

సంస్కృతం— వాల్మీకి రామాయణం

## తుమ్మెద బారు

తమ్మి పూదెనె తెగ ద్రావి
జుమ్మ్మంచు
పారిపోయెడి
తుమ్మెద బారు గనుము:

చెలియా, నాసంత లక్ష్మి
నై సేసికొన్న
ఘుణ ఘుణాల మ్రోయు,
మొలనూలు చాయనుండె.

ప్రాకృతం - సప్తశతి

## చెవుడా

అంత గట్టిగా దేవుని
ఆహ్వానింతు వదేటికి?
ఆయన కేం చెవుడా మరి?
ఆలకింపలేడా హరి?

హిందీ - కబీర్

## ధర్మమా!

ఈ కనాటమ్ము
నెవరో బంధించినారు?
నిలువ లేకుంటి
నడుగులు తలకుచుండె?
ఊబిలో కూరుకొని
పోవుచుంటి నేమొ?
ఓసి ధర్మమ!
నాకు చేయూత నిమ్ము

గుజరాతీ — నర్మదలాల్

## స్వతంత్రతాస్థ

ప్రేమపాశ బంధనములు
విడువు మింతి.
చాలు నీ తియ్యముద్దుల
పూలరసము.
ఈ సుగంధ బంధురధూమ
మెడద కూపిరాడ నీయదు?
తలుపుల నన్ని దెఱచి
యిచట నుదయ కాంతులు
ప్రసారింపనిమ్ము.
లలితి తనులాలనా
దుకూలాల మడతలందు
నన్ చుట్టి పెట్టితి వబ్బ!
మునిగిపోయినాడ నీలోన
నీ పుణ్యమా యె!
తలిరుపలుకులనుండి
స్వాతంత్ర్యమిమ్ము.
వెనుక కిమ్ము
నా పురుషత్వమును;
స్వతంత్ర
హృదయ సుమము
నీ కర్పణ సేతు
నప్పుడు.

(10)

## సిగ్గా - వలపా

నునుసిగ్గు గడియు, వే
సిన కవాటమ్ము లీ
పెనువలపు గొడ్డలికి
మనలేక విడిపోవు.

బెంగాలీ - టాగూర్

## లేడా?

చందనంపు బొమ్మలలో
చలువరాతి పలకలలో
రంగద్దిన పటాలలో
రంజిల్లెడు భగవంతుడు
తనలోమాత్రం లేడా!
వినుమా సర్వజ్ఞుడా!

తమిళం - నమ్మాళ్వార్

## మూర్ఖపద్ధతి

నింగిని నేలను
నిలిపి కుట్టగల
నేర్పరు లున్నారంటే
ఔనౌ నననవలె
అంతే: మూర్ఖుల
చెంత వాదమే వలదూ.

కన్నడం - సర్వజ్ఞమూర్తి

## నిగ్రహం

కొండపై నిల్లు గట్టుకొని
మృగములకు వెఱచిన నెట్లయ్యా?
సముద్రపు గట్టున నిల్లు గట్టుకొని
నురుగు తరగలకు భయపడిన నెట్లయ్యా?
సంతలో నిల్లుగట్టుకొని
శబ్దమునకు సంతోషించిన నెట్లయ్యా?
చెన్న మల్లిఖార్జున దేవ వినవయ్యా!
లోకమున బుట్టిన పిదప
స్తుతి నిందలు వచ్చిన
మనసున కోపింపక
నెమ్మదిగా నుండవలెనయ్యా!

కన్నడం.- మహాదేవి యక్క - కర్ణాటక వచనాలు

## స్వర్గమెందుకు?

వెచ్చనైన యిల్లు
వెచ్చమునకు ముల్లె,
మెచ్చి తెచ్చుకున్న
మచ్చెకంటి,
ఇచ్చ వచ్చినటు
లభించిన, దివికింక
చిచ్చు పెట్టమని
వచింతు నేను.

కన్నడం - సర్వజ్ఞమూర్తి

## రుద్రస్తవం

వేధించకయ్యా మా
వృద్ధజనమ్ముని
బాధించకయ్యా మా
బాలవ్రజమ్ముని
కారించకయ్యా మా
కన్నకుమాళ్ళ,
కాజేయకయ్యా మా
గర్భార్భకులను,
మట్టుబెట్టకుము మా
మాతల పితల,
మాడ్చివేయకుము మా
మంచి దేహాల
మా తండ్రి రుద్రుడా
మమ్ము కాపాడు.

వైదికం - ఋగ్వేదం

## మంచలింపు

నీ కన్ను సూదితో
నీవే గ్రుచ్చుకుంటున్నావు;
నిశాత ఖడ్గధారను
నీ నాలుకతో నాకుతున్నావు!
నీరజాక్షుని సతిని

నీవు కోరుకుంటున్నావు!
నీ మెడకు రాయి కట్టుకుని
నీరధిని యీదాలనుకున్నావు!
నింగినుండి సూర్య చంద్రులను
దొంగిలించా లనుకుంటున్నావు!
నీచుడా శ్రీరామచంద్రుని భార్యను
నిష్కల్మష పతివ్రతను
నీ దాన్ని చేసుకోదలచి
నిప్పును ఒడిగట్టుకుంటున్నావు.

పౌరాణికం - వాల్మీకి

## సూచన

పడుకొన్న దిట
ముదివగ్గు మా తల్లి,
కడువృద్ధు డిట తండ్రి
పడుకున్న వాడు;
పవలెల్ల పనిచేసి
బడలి మైమఱచి
పవళించె నిదిగో మా
పనికత్తె యిచట;
ఇంటి యాయన ఊరి
కేగగా నిట్టు

లొంటిదానను పడు
కొంటి నిచ్చోట:
నీ వేమొ అటు శయ
నింతువు గాని
లేవయ్య — అనుచు నా
తే జవరాలు
మాట మీదుగ జెప్పి
మాటల తోనె —
బాటసారికి గుట్టు
చాటించుచుండె.

లౌకికం - ముక్తకం

## విచిత్ర సంచయం

ధర్మమూల గంగ
దనరు నీ పదముల,
నర్థమూల లక్ష్మి
యలరు నెడద,
కామదేవుడేమొ
కన్న కుమారుడే,
మోక్షదాతవైన
మూర్తి వీవె.

— నైషధం

## ము రు వు లు

నెల బాలునితో
నిశ పెంపెసగున్;
నళినీ లత త
మ్ములతో వెలుగున్;
చెలగున్ లత పు
వ్వుల గుత్తులతో;
వెలయున్ కవితల్
విమలాత్ములతో.

ప్రాకృతం - గాథ

## స్వ యం గా

మావి చివురు తురాయితో,
మత్తు గోలుపు
వలపు తావుతో—
మెఱుంగులను జిమ్ము
మధు రమా వదనమ్ము
మన్మథుడు,
తనకు నెవ్వ రివ్వకున్న
బరిగ్రహించినాడు.

-హరివిజయం

## త్వరపడు

ఇంటికి బోవువేళ
గతియించెను;
బిందెను నించుకొమ్ము
వాల్గంటి!
కులాస నూటకయె
గాజులు గల్లనుపింతు వేల?
కేలంటి జలమ్ముతో
సరస మాడుచు
నుంటి వదేల?
దారినే కొంటెగ జూతు
వెవ్వరుని కోసమొ?
కోమల పల్లవాధరీ!
ఎక్కుచునుండె ప్రొద్దు
రమణీ మణి
ఏటును పాటిపోవు
నిం కెక్కడికో!
తరంగము లవే
చిటునవ్వుల
మేలమాడుచున్
నిక్కుచునుండె,
మిట్టపయి
నెమ్మది జేరిన

మబ్బుకోన
లో చక్కని దాన!
నీ మొగము సా
బరికించి హసించు
చూడుమా!
వేళయయ్యె నింకనైన
వేగపడుము కడవనీరు
వేవేగమె నించుకొనుము
వెలదీ యింటికి వెడలుము.

బెంగాలీ .... రవీంద్రుడు

## పరంధామా!

కఠోర వస్తుప్రతతి గూడ నీ
కరస్పర్శతో కఱగి నీ రగును;
జరామరణ శోకపుంజము
నీ తనుకిరణ పూరముల
విరవిర లాగును;
పరంధామ! నీ కాంతివాహినీ
పరిస్నానమునె
పొంగిపోయెదను.

తమిళం - పెరియాళ్వార్

## మాటా - మంచీ

మృదు మధుర ప్రియవాక్కుల
విదితమ్మగునట్టి తేత
విరి మర్యాదన్,
తొందరలేక బ్రతుకుదురు
నరు, లది లేనిది
కట్టుబొట్టు లైక్యపఱచునా?

- తిరుక్కురళ్

## కృపారాశి

జగన్నాథ కృపాప్రభల
జగా వెలుగు వెల్లువలై
నిగ నిగ వలయమ్ములుగా
ధగ ధగ లాడును గానీ
కలలలోన భూతమ్ములు,
తల విదిల్చు దయ్యమ్ములు.
వలె నా కెప్పుడు నయ్యవి
తల చూపవు పొడచూపవు.

-బూదితాళ్వార్

## ఉషశ్శబరి

అనుదిన ముదయించు,
చిరంతనురా లీ ఉషోదేవి:
అనయము మారని రంగున
కనిపించే వెలుగుదీవి:

చెంచెత పక్షుల పట్టి
వధించునట్లు,
మానవుల గలంచు,
వారి యాయుస్సును
కొంచె కొంచెమే హరించు.

వైదికం - ఋగ్వేదం

## మందాక్షమాలిక

చిత్రపటమున నున్నట్టి
చిత్రచోరు జూచి నంతనె.
నిజమట్లు చొక్కిపోయి,
సిగ్గు మొగ్గలవేయ,
కాసంత మోము వాల్చె
నప్రయత్నమ్మొగా
వాలుగంటి.

సంస్కృతం - నవ సాహసాంక చరిత్రం

## లోకవృత్తం

పాడులోకము!
బహుమతి పట్టుమంచు
పది దినమ్ము లొక్కరిపయి
కుదురు పడదు:
కాలగతి, గుణవంతులు

తేలికవడుటయును
మన లోకపుతీరేగాదె

భారతీయ

మూ పు లు ప టు

ప్రాకృతం - సత్తసయి

యమున కెట్లు నీటికోస
మరుగుచునమ్మా?
'ఆ'
విమలాంగుని మురళీ రవము
వినపడునమ్మా!
ఆ
రమణీ హృచ్చోరుని నే
త్రము లవిగోనే?
ఏమో లాస్యము చేయుచు
నింతి పిలుచునే!

మి టా రి

గుజరాతీ - నరసింహుడు

వెదురు కొమ్మ వోలు
వెలది చేతులు,
చిగురాకు వోలు తనువు,
హాసరుచులు
ముత్తెములను చిందు,
ముదిత యూర్పులు
గుబాళించు,
చూపు ప్రజ్వలించు నెడద.

తమిళం - తిరువళ్ళువర్

## అదెందుకు?

కొఱ్ఱన్నము గట్టిపెరుగు
జుఱ్ఱే భాగ్యము గల్గిన
వెఱ్ఱా పిచ్చా అమృతము
నఱ్ఱాకులు వడికోరుట?

కన్నడం - సర్వజ్ఞుడు

## ఉషోధేనువు

చిమ్మచీకటి రేయి—
గుమ్మమును విడివచ్చి,
ధవళవత్సము వోలె
రవివెంట నంటి రా,
దివ్యాచ్ఛయా ఉషో
దేవి యరుదెంచినది:
అమరు లవినాభావ
తమ రూపులా, ఉషో
రవులు. రోదసి వెడలి
భువనాల దివ్వెలను
సవరించుచున్నారు.

వైదికం - ఋగ్వేదం

## లో కం శో క హ తం

తామరాకుమీద
తళతళలాడు
తోయమ్ము వోలె
జీవితమ్ము చపలమవును;
రోగ మోహామయము
లోకమెల్ల;
శోకహతమే సుమ్ము
శూన్యబుద్ధి!

సంస్కృతం - శంకరాచార్యులు

## అ వ తం సం

చెవిని బెట్టుకున్న
చిన్ని పూగుత్తి,
ఆ సుదతి చెక్కులకును
సోకుచుండ;
కానుపించె, రమణి
క్రమ కపోల సౌందర్యమెల్ల
గ్రోల దరియునట్లు.

ప్రాకృతం - సత్తసయీ

## ప్రేమ తత్త్వం

ప్రేమ ప్రేమ యని
పెక్కు వచింతురు—
ప్రేమ నెఱింగిన
పెద్ద లెవ్వరో?
ప్రేమ అంతగా
విదితమైనచో
నీ మహా రోదన
లిన్ని ఎందులకు?

హిందీ - రసఖాని

## శవ జాగరణం

మును పెప్పుడో పుట్టి
చనిపోయినట్టి
ఏ జనుల దయకోసమో
సణుగుతారే మీరు?
చచ్చిన శవాల
ఏ సంగతులనో చదువ
సౌఖ్యమెక్కడిది?
ఈ సన్యాసి బడుగులకు?

గుజరాతీ - అఖా భగత్

## మనసు మనసునకే క!

పూలచెండు కట్టుటకీ
ప్రొద్దంతా కూరుచుంటి;
పూలు జారి జారి పోవు
పోలతి యెందుకో?

బెంగాలీ - టాగూర్

## కరుణ

పాడ వీలు లేవి
పాట యేమిటికి?
నీరాడునట్టి
కంటి జాడ లేల?
జాలి లేని కన్ను లేల;
కురుపులట్లు?
కరుణ కనుల
కొంకు - మురుపు సుమ్మ.

తమిళం - కురళ్

## వనిలో...

తుమ్మెద తన కూర్చు
తొయ్యాలి దాచ్చి
తమ్మి యింటికి దెచ్చి
తమకించి యపుడు
పలుమారు గండూష
ఫలరసం బిచ్చె.

చిలుక బోటికి నింపు
జిలుకంగ ననుచు
జిరుడు లంచము లిచ్చె
జీవితేశ్వరుడు,
జగరాంగ కోయిల
జవరాలి కనుచు
నొనరిక వలపు లోం
డొరులకు జెప్పు
కొనులీలఁ జక్కవ
కొమ్మలు గదిసే
సరస పల్లవ రాగ
సామగ్రి మిగుల
జరియించు చందంబు
జైత్రాగమమున
దనయున్న చందంబు
దర్శించు కొనుచు
నెనయ వచ్చిన మెచ్చి
యీ మావి కొమ్మ
దలయూచు విధమున
దను గాలి చేత
జలియిప్ప జొచ్చెను
జర్పించు మబల ?

తెలుగు — రామనార్య, కుశలవో పాఖ్యానం.

## ని రీ క్ష - ని రా శ

చిలుక, బూరుగుకాయ
నీక్షించి, మురిసి,
పండ నిమ్మని వేచి
కూర్చుండి తుదకు,
పండి పగిలిన, దూది
యందుండి యెగిరి
గాలికిం బో, నిరాశతో
దూలిపోయె.

సంస్కృతం—పండిత రాజు

## ని ర్వ చ నా లు

చేతనున్నదే విత్తంబు ;
చెడిన యపుడు
విడువకున్నట్టివాడె మి
త్రుడు ; గుణమ్ము
సంతరించుకున్నదె రూపు;
జ్ఞానమన్న
పరమ ధర్మ సంపన్నమై
వరలు నదియె.

ప్రాకృతం—సప్తశతి,

## వి రి గి న మ న సు

ఒకపరి కపటము వెలువడి
వికటించిన ప్రేమ, తిరిగి
విరిసిన నంతే ;
ఒకసారి కాచి దించిన
నిక నీటికి మొదటి రుచి
లభించదు సుమ్మీ.

ప్రాకృతం— గాథా సప్తశతి.

## లు బ్ధ ధ న ం

ఎంత యున్న నేమి
యెందుకు కొరగాదు
పిసినిగొట్టు ధన
సమృద్ధి సుమ్మి ;
ఎండలోన మాడు
చుండు పాంథుని కేమి
మేలు సేయు తనదు
నీని నీడ.

ప్రాకృతం—కుందపుత్ర

## పా ల వె ల్లు వ

పరివ్యాప్తతమః కేశ
పంక్తిని పరపర కోయుచు,
పరుగున వస్తున్న దదో
పరికించుము మహోషన్ను.

తిమిరాచ్ఛాదితమౌ వ
క్షమ్ము పై తెరతీసి, వెలుగు
గమ్ముల పాల వెల్లువ నె
య్యముతో కురిపిస్తున్నది
జగమ్ములకు దివ్వె వెట్టి
జగా వెలుగుతో చీకటి
పొగరు కడుపులను తోలుచు
నగవలతో వస్తున్నది.

వైదికం — ఋగ్వేదం.

## శూన్య శయ్య

నిబ్బరము పోయె,
మాలిమి నేల గలిసె,
మూగవోయెను నా పాట,
మోడు వారె ఋతువు.
మురువులు దాల్చుట
లేల యింక ?
సర్వశూన్య మయ్యెను
నాదు శయ్య యిపుడు.

సంస్కృతం — కాళిదాసు.

## లతాశ్రువులు

మేయుటను మాని
నిలుచుండె మృగములెల్ల;
నృత్యములు మానివేసెను

నెమలి గుంపు;
పండుటాకుల రాల్చు
తీవలును
నస్రు కణములను
రాల్చు చున్నట్టు గానుపించు.

ప్రాకృతం — శాకుంతలం

## చిన్నదివాలు!

బురద గుంట మేలు,
దరి జేరు క్షుద్ర జీవాల
దాహమైన బాపజాలు;
అబ్ధి ఎంత పెద్దదయిన
లాభ మేమ్మి?
వేని దప్పి తీర్చివేయగలదు?

హిందీ....రహీమ్.

## వేదనాభారం

నా యెడంద నవ్వ లేదు.
నానా భారముతో నది
నవసి నవసి పోతున్నది.
ఒంటరినైనా గానీ
కంట నీరు పెట్టబోదు;
నోట మాటరాదు,

మూగనోము పట్టినది నా హృది;
కానీ యీ గీతులతో
కావచ్చును మరి తేలిక.

గుజరాతీ—నర్మద లాల్.

## తప్పు అతనిదా?

ప్రియుని దర్శన
మొక్క క్షణమయిన
వీడి యుండలేక,
నే కను మూయకుండ
బ్రతుకుచుంటి;
నిది చూచి యీ పల్లెటూరి వార
లతని దయలేనివా డని
యందు రేల?

తమిళం—తిరువళ్ళువర్.

## గుండెమంట

ఒకతె నేడిపించు,
నొకతె నవ్వించు,
నీ గడుసువాడు;
బాధ పడిన మానె—
వాని ప్రక్కలందు

పల్లేరు గాయలు
రాల నిమ్ము!
మనసు రగులుచుండె

కన్నడం — పాతపదం

## నీ యిష్టం

పడతి యేదో పాట
పాడుకుంటున్నాను—
పడదంటివా సరే
విడిచి పెడతాను.
తెఱపిగా నీ మోము
తేఱి చూస్తున్నాను
మఱి యదరు నా గుండె
మూసివేస్తాను.
సుదతి వస్తున్నావు—
ఎదురు పడినాను,
బెదరెదవా దారి
వదలి పోతాను.
తోటలో పూలు కడు
తూ వుంటె వచ్చాను.
తొట్రు పడెదెవ నేను
తొలగి పోతాను.
పడవ నీ రేవులో

నడుపుకుంటున్నాను
చెడి కలగు నా సీరు
చేర నిం కెపుడు.

బెంగాలీ—రవీంద్రుడు

జడి

గురుగుం, జెంచలి, దుమ్మి,
లే దగిరిసాకుం,
దింత్రిణీ పల్లవోత్కరముం
గూడ బొరంటి నూనియలతో
గట్టావి కుట్టారు
కోగిరము లెమ్మికి,
తమిం గామ ల్వాలము వో
ద్రేపు లెమ్మియుల్లాక,
మే కెరువుం గుంపటి
మంచ మెక్కిరి,
ప్రభుత్త్వ కొత్తి
రెడ్ల జడిన్.

తెలుగు—ఆముక్తమాల్యద

భ్రమ

పచ్చనాకుల పండ్లున్న
పాదపమని
చేరం, జిలకల పెనుగుంపు
చెదరిపోయె

వట్టి యెండిపోయిన
మట్టిచెట్టు నిలువ
చేతులందట్టి నవ్వెరి
చేరువారు !

ప్రాకృతం—అణులచ్చీ

## ప్రాకృత ప్రశంస

లలితము, మధురాక్షర సం
కలితము, లలనా హృదబ్జ
గలితము, రససం
చలితము ప్రాకృత కావ్యము
కలుగన్ సంస్కృతము నెవడు
కనులం జూచున్.

ప్రాకృతం - వజ్జాలగ్గం

## కారణం

వనితాధర సుధ గ్రోలిన
జనుని వచ స్తతియె
మధుర సంయుతమౌ;
ఆమని మావిచివురుపాత్రములను
మెసవిన పికమెకద
కలధ్వని సేయున్

సంస్కృతం—ఆర్యాసప్తశతి

## సంభ్రమం

వెన్నెలలో కూర్చున్నది
వెలది. ఆమె చెవులలోని

నీలాలవి చెక్కులపై
నిగనిగలాడెన్.

ప్రియుడు చూచి కన్నీళ్ళని
బెదరిపోయి తుడువజూచి

చాన నవ్వు గలగల విని
సంభ్రమించెనూ.

ప్రాకృతం - సత్తసయీ

## మనసు నిలవదు

అగ్ని జ్వాలల కయినా
ఆగవచ్చు; నిశిత ఖడ్గ
ధారనయిన నెదిరించగ
తరమగు మనిషికి, కానీ
ఏకాగ్ర మనస్కుడై
ఏదో పని, నిమగ్నుడై
పని సేయుట దుష్కర మని
పలికె కబీరూ.

హిందీ - కబీర్

## మాయాజాలం

అతని కన్నులలో నెదో
　　అననుమేయ
మైన యింద్రజాల మ్మున్న
　　దనుపమాన
సుందరమ్ములా నయనమ్ము
　　లెందుకొ౦అకొ
నన్ను సమ్మోహితను జేసి
　　నడవనీవు—

గుజరాతీ — నరసింహుని శృంగారమాల

## ధీరత

ఆజి విరోధితండము
ననంత భయమ్మున ముంచివేయు నా
రాజసమెల్ల ౹మాన్పడి
ధరన్ బడిపోవుట చిత్రమయ్యె:
నన్నిజ జవరాలి సొంపు దులకించు
లలాట మనోజ్ఞ రూపమే నా
జిఱు జేసివైచిన దహో:
వనితామణులెంత ధీరలో!

తమిళం — కురళ్

ఊరకే!

వచ్చుచుండును పోవుచుండును
వరుసగా ప్రతిదినము నాతడు
వాలుజడలో పూవు గొని చని
వాని కొసగును నెచ్చెలీ.

ఎవరు పంపిరటంచు నడిగిన
నువిద, పేరును చెప్పబోకును
వచ్చుచుండును పోవుచుండును
వరుసగా నత డూరకే.

చెట్టు మొదటను కూరుచుండును
కట్టుచుండును పూలదండలు
కమలు నాతని కనుల వేదన
నమిలివేయును నెమ్మదిన్.

అతని కోరికయేమిటో మరి?
అంత కూడా తెలియనివ్వడు?
అదే పనిగా వచ్చుచుండును
ఆత డూరకె కోమలీ

బెంగాలీ — టాగూర్

## గృహసౌభాగ్యం

నా కోడలు కొడుకును గన
నా కూతురు బిడ్డను గన
నా యెనుములు పాలు పిండ

నా యింటికి వచ్చి శివుడు
నా భాగ్యము చూడవలెను

కన్నడం - (పాతపాట)

## ప ద జా లం

నదమా పొక్కిలి,
జాంబూనదనూ మెయిచాయ,
క ెకనదమా పదము,
ఆపదమా జడ,
నడుము వియత్పదమా,
నూగారు గూఢ పదమా
చెలికిన్.

తెలుగు — కూచిమంచి తిమ్మకవి

## నా వం తు

బారంట యలదేటి
బారంట పెనగేని
గోరంట కేతెమ్మ
గోరంట గుత్తి.
నెరనాదివై నీవు
విరవాది దేకున్న
వెరవేది వలరాచ
దొరకేది కిపుడు,
నీతులా రామచే

నీతులాయెను వగలు
జాతులు దెమ్మన్న
జాతు లేలమ్మ?
యావంత లేటికే
నీ వెఁత బెఁగినా
చావంతి పూబంతి
నా వంతు గాదా —

— విప్రనారాయణ యక్షగానం

తీసుకొనుటలో తేడాలు

సహజ లభ్యమైన
సరితూగు పాలతో;
అడిగిపుచ్చుకున్న
దగును నీరు;
లాగికొన్న దేమొ
రక్తమ్ము వంటిది
అంచు గోరకుఁడు
వచించినాడు.

-గోరఖ్‌నాథ్

సాహసే లక్ష్మీః

అగాధ జలనిధి యంతరాంతరము
నధిగమించు వాఁడే, అమూల్యమౌ ము
త్యాల గోవలను తనవి చేసుకొనునూ

పయోధిలోనికి ప్రవేశించు ధైర్యము శూన్యము కాగా, అయ్యో తీరము
నందే కూర్చుని అంగలార్చుచుంటి—

హిందీ — కబీర్

## రాలు దేవులైన...

రాతిని పూజించే హరిదారికే
రాస్తా నిజమయితే
గాత్రి కేమి మరి కొండ కొండకే
చేతును పూజలనూ.
రాతికన్న తిరగలి మేల్ కాదా?
ఏ తీరున గన్నా,
ఈ లోకం ఆకలి తీర్చుట కది
యిచ్చు పిండినైనా?

హిందీ - కబీర్

## లోకలోచనం

లోకమునకు లోచనమ్ము,
లోలచిత్ర లోచితమ్ము
నాలోకింపు ముషస్సును,
తమోభుగ్న కుటీప్రాంగ
ణముల కవాటముల దెఱచె:
తతోధ్వానమైన జగము

తెర దొలగించిన దదిగో
విశ్వమ్ముల మేలుకొల్పి
వికసించిన దుషోదేవి.

వైదికం — ఋగ్వేదం

## మౌ న స మా ధా నం

ఆ చామనచాయ మనిషి
అమ్మా నీ కేమవుతా.
డనుచు పథిక సఖులు జేరి
అడిగిరి సీతమ్మనూ—
చిరునవ్వుల దొంతరలను
చిదుముకొంచు నునుసిగ్గుల
సీత తలను వంచె: నదే
చెప్పె జవాబూ—

సంస్కృతం — మహాభారతం

## అ త ని గూ ర్చి

ఇంత పగబట్టి సకియ,
రేయింబవళ్ళు
మదను, డాతనిగూడ
నన్మాడ్చి నట్లె
మాడ్చునా యేమి?

అల్లైన మరుని బాధ
నెట్టు లొంటిగ నతడు
సహింప గలడు!

ప్రాకృతం - మానవతి

## కనులలో...

దేశాంతరమున
నుండిన ప్రియుని కైతే,
జాబులైనా వ్రాయ
సరిపడును గాని—
తనువులో, మనసులో,
కనులలో నున్న
ప్రణయమూర్తికి వార్త
పంపుట యెట్లు?

హిందీ - కబీర్

## సెలవు!

మంగళము పాడి యిక
మనము విడిపోవుదము,
మఱచి పొమ్మా రాత్రి
జరిగిపోయిన వెన్క;
ఎవరి నా చేతులం
దిక హత్తు కొనగలను?
కల లెన్నటికి దొరక
కవు:పట్టు కొనలేను.

తమి నా కరములు, శూ
న్యము నెదకు నదుముకొను,
శూన్య భారమున, హృ
త్పుటము సుంద్రుడుకపోవు.

బెంగాలీ - రవీంద్రుడు

## నిలువనివాడు

నను వదలడమ్మా అతగాడు
నను వీడ డమ్మా ॥నను॥

నా ముఖమ్మున నేమి
నవ్యతను చూచెనో
నన్ను కన్నులతోనె
నమిలి వేయును సుమ్మా ॥నను॥

నీటి కెడితే వెంట
నెనరుతో వచ్చునే.
నీటి కుండను పట్టి
నెంత అందించునే ॥నను॥

ఇదియేమి'టని కసిరి
విదిలించినా పోడు,
పదిసార్లు మా యింటి
గదివేపు తిరుగునే ॥నను॥

ఒంటరిగ కనబడిన
ఉరుకుతూ వచ్చునే

ఒల్ల నన్నా మెడకు
మల్లె దండను వేయు ॥నను॥
ఒదిగి నిలుచుంటాడు.
ఒక మాట!—అంటాడు
ఒక్క నిముషము శాంతి
ఉండనీ డమ్మా.
నను వదల డమ్మా అతగాడు
నను వీడ డమ్మా—

గుజరాతీ - దయారాం, గరభీ

ఛాయ

దినకరుని వోలె నడవికి
చనియె రాముడు,
అతని వెన్కనె దిన మన
నరిగె లక్ష్మణుండు,
దినకర దినములు
రెండు నరుగ
ఛాయవోలిక సీతయు
సాగిపోయె.

సంస్కృతం -భాసుడు

చిలుకచాలు

నేలవ్రాలు చిలుక
చాలును జూచితే
గగనలక్ష్మి మెడను

కట్టుకున్న
మరకతముల కంటె
మహీమీఁదబడిపోవుచున్నమాడిక్క
తోఁచుచున్నదదిగో.

ప్రాకృతం - గాథాసప్తశతి

## ఒరగాదు ముఖ్యం

సాధు జనులు జూచి
జాతి ప్రశ్నించకు;
జ్ఞానభిక్ష నడుగ బూనకొనుము;
కత్తి బేరమాడ గవలె నంతియే
దాని యొరనుగూర్చి?
తగవులేల

హిందీ - కబీర్

## మత వంచకులు

మతబోధకుల నమ్మబోకు
నీవు మాయదారుల
వలనుబడకూ ॥మత॥
చిల్లికడవను వేసి వారూ, నీరూ
చేదబోయేవారు వారూ ॥మత॥
తెలివిలేనీ పండితుండూ పరుల
పొలములో మేసేటి పోతంటివాడూ ॥మత॥
కల్లుతాగిన కోతికన్నా చెడిన
కడగొట్టు జాతండి వాడూ ॥మత॥

నీకు నీవే గురువు కమ్మ నీలోని
నిన్ను, సేవించి ముక్తిని చూరగొమ్మ ॥మత॥
మతబోధకుల చేరబోకూ నీవు
మాయదారుల వలనుబడకూ

గుజరాతీ - అఖా భగత్

జాగు సేయకు

నెలతా దువ్విన వెండ్రుకల్
చెదరిపోనీ,
కేశపాశాంత పొట్టలుపోనీ,
భవ దంశుక మ్మొకట రెంటన్ జారనీ
కాని, చింతిలగా నేమియు లేదు
వేగముగ వొంటిన్ రమ్మ
ప్రసాధనాకుల వై
లో దిరుగాడు చుండి యిటు
జాగున్ సేయరా దెప్పుడున్.

బెంగాలీ - టాగూర్

కనులు

కాటుకనుపట్టినట్టి యీ
కన్నుదోయి నేమనన్వలె?
నొక్కటెట నెమ్మనమ్ము
గ్రుచ్చుకోరాడు

మరియొక కోపునందు
మచ్చికను జూపి యెడదకు
మందు వేయు.

తమిళం - కురళ్

## ఎందుకు?

అలికిన యిల్లూ. అం
దుల దొంతులు వరుసా, పం
చల నటునిటు తిరిగే, ఖిం
దుల మగవాడూ, నె
చ్చెలి వుంటే యిక క
మ్మలలో వజ్రాలూ చె
క్కులు తళతళ లాడాలా?

కన్నడం - పల్లెపాట

## సురనది

తరుణతర తరణి కిరణ
స్ఫురణ విడంబించు
నభవు జూటాటనిలో
సురనదివోలిచె
లతాంత స్థిర కింశుక
వనము నడిమి
హంసియ వోలెన్.

—నన్నెచోడుడు

# చందమామ

సంధిలు పూర్వదిక్సతి
మణికాంచి పై రంజిల్లు
నాయకరత్న మొక్కొ?
విలసిల్లు సద్దేవి
వృత్త సనాంతరాపూరిత
కాశ్మీర పుంజ మొక్కొ?
తనరారు నా హరిత్తరళాక్షి
పరిపక్వ బింబారుణాధర
బింబ మొక్కొ?
మేలిల్లు నబ్బాల ఫాలతటంబున
విలసిల్లు రోచన తిలక మొక్కొ?
మొవ్వ మొప్పు దన
సమాగమంబునకు
నా రమణి వలన బవ్వ
గాగ మొక్కొ?
అనగ దరతరంబ
తనరె,
నత్యరుణాంగభతి
గువలయైక బాంధవుండు.

తెలుగు - నన్నెచోడుడు

## తుల

వా తెఱకు నమృతమే తుల:
మేతుల కింపుల పిపాళి
మిసిమికి
క్రొమ్మించే తుల:
చేతుల కజ్జములే తుల
లేతుల వెలందు
లీ చెలి తులయే.

విజయవిలాసము    చేమకూరి వెంకటకవి

## ఊర్మిలా దేవి నిద్ర

సతిపతుల చింతజూచీ
కౌసల్య సంపెంగనూనె దెచ్చి
రత్నపీఠము నుంచియా
కౌసల్య దంపతుల శిరసంటెను
గంధమట చెలిదెచ్చియు
యొక్క-చెలి పన్నీట జలకమార్చె
మేలైన వలిపట్టుతో
లక్ష్మణునకు మేనుతల్లొత్తి రపుడు

బంగారు పూలపట్టు
ఊర్మిళకు బాగుమీరా రాకట్టెను.
కోటిసూర్యా దీప్తితో
వెలిగేటి మేలైన రవికదొడగె.
ఆభరణములు సొమ్ములు
ఆయాదిలక్ష్మికే అలంకరించి
ముత్యాల తిరుమూర్ణము
లక్ష్మన్న రంజిల్ల ధరియుంచెను.
వెలలేని మాణిక్యమూ
పతిగూడి నిలుపుటద్దము జూచెను.
సిగ్గుపడి శిరసాంచుక
చిరునవ్వుతో నిలచెను

తెలుగు — ఊర్మిళాదేవి నిద్ర

కార్యవాది

నిశితమైన బుద్ధి,
నిశ్చయ జ్ఞానమ్ము,
వెన్న వంటి మనసు,
వేని కొఱకు
ప్రాకులాట లేమి —
పరిఢవిల్లినవాని
జేర్చుకొనుము
పనులు దీర్చుకొఱకు.

తమిళం — తిరువళ్ళువార్

ఆడిరా

ఆడిరా ఆడిరా
ఆడిరా నాయనా
అరకాళ్ళు కడుగుతా
ఆడిరా నాయనా.
ఆడిరా బంగారు
వాడ, నీ మొగముపై
నీడ కనుపించగా
నీటితో కడిగెదను
ఆడిరా ఆడిరా
ఆడిరా నాయనా

కన్నడం — పల్లెపదం.

వేకువయినా....

అకటా! యేమని దూఱుదాన
నిను నాథా, వేగుజామయ్యె.
పొందికగా పాదము లొత్తి
రమ్మనుట గానీ,
ఒంటి యేమో కదా
నికట క్షోణికి
చేర రమ్మనుట గానీ,
కొంత నెయ్యంపు ప్రానికతో
కన్నుల నెత్తి చూచుటయు కానీ
లేదొకింతేనియున్.

తెలుగు — పింగళి సూరన

## జలక్రీడ

బంగారు బిందెల
పన్నీరు నించుక
శృంగారవతి మీద
చెలియ చల్లెను.
పొంగుచు ప్రహ్లాడి
పొలతి యొక్కతె తెచ్చి
రంగైన యందెల
రమణిపై జల్లెను.
జాళువా చిమ్మనగోవి
జాతి కుంకుమదెచ్చి
బాల యొక్కతె చిమ్మె
పణతిపై నడుమ.
విరిబోణి యొసగిన
విరులూని యందెల
తెరవ యొక్కతె చిమ్మె
దేవిపై నపుడు.

తెలుగు - విప్రనారాయణ యక్షగానం

వసంతం

కన్నెరో! చూచితే
గబ్బారదీవి
విన్నాణ మాయె నీ
విరిగుజ్జుమావి
పొన్న మాకుల క్రింద
పూదేనె బావి
సన్నగాడ్పులు దెచ్చె
సంపంగి తావి
దులదుల వచ్చేని
తుమ్మెదబారు
కలకలమనుచు
చిలుకల దుమారు
వలపల డిగినారు
వలరాచవారు
కొమ్మరో వింటివే
కోయిలపాట
ఆమని సరకులు
హావణించె పేట
కాముని దళవాయి
కాపున్న కోట
ఏమని వర్ణింతు
నీ యేటి బాట.

తెలుగు - విప్రనారాయణ యక్షగానం.

## పక్షపాతం

కానలో నన్ను నే
గాపాడుకొనుటయే
మీరు నాపై నుంచి
నారు గానీ; సర్వ
భువన భారమ్ము త
మ్ముని తలన్ మోపితిరి;
తల్లి, మా మా పనుల
తరచి చూచిన దెలియు,
నా పయిని మీ కెంత
గా పక్షపాతమ్ము
జూపినారో, నాకు
చోద్యమయ్యెడి నమ్మ.

సంస్కృతం - భోజరాజు

## మంచుచినుకులు

మరకతపు గ్రోవి గుచ్చిన
మౌక్తికముల వలెను;
దూర్వాంకురములపై
నిలిచినట్టి మంచుచినుకుల
నో చెలీ, మించు నెమలి
యేరుకొను తినుచున్నదా
సౌరు గనుము.

ప్రాకృతం - సత్తసయి

ఏల?

సరసిజము వినా సరసేలా?
సరసు వినా సరసిజమేలా?
సరోజ బంధుని కిరణము లేనీ
సరసిజ సరో వరము లేలా?
ప్రాయము లేనీ కాయమ్మేలా?
కాయము లేనీ ప్రాయమ్మేలా?
ప్రేయసి విడి కంపించే గుండెకు
కాయమ్మూ, ప్రాయమ్మేలా?
వెలదీ! యేమని
విన్నవింతునే
విధి విరోధియై
వెతలు పెట్టునే—

బెంగాలి - విద్యాపతి

ఉన్నా....

గంగ, యమున, సరస్వతీ
కలవు; సప్త మహాంబుధులు
కలవు—కాని, తులసి చాత
కమునకు స్వాతిని వినా
కమ్మని నీరే దొరకదు;
సుమ్మా! సత్యము వచింతు.

హిందీ - తులసీదాసు

కూ య కే....

కోయంచు కూయకే
కూయకే కోయిలా!
కూసి నా గుండియల
కుళ్ళిపో జేయకే

ఈ యభాగ్యను వీడి
యెట వోయెనో ప్రియుడు
ఏకాకినై వెతల
చీకాకు పడుచుంటి

కోయిలా కూయకే—

సరులు భారమ్మాయె
నురముపై కోయిలా!
మురుపులే నా తనువు
చురచురా కాల్చునే
కోయిలా కూయకే—
పూలవలపులు వెండి
జాలు వెన్నెల కలలు
కాలనేమోగాని
చాల వేధించునే
కోయిలా కూయకే—

తెలివలిప మేలోకో
కలగించునే గుండె

చలి వడంకుచునుంటి
తలపు బరువెక్కెనే!

కోయిలా కూయకే
కూయకే కోయిలా
కూసి నా గుండియలు
కుళ్ళిపో జేయకే.

గుజరాతీ - సోమసుందర్

## ఘనుడు

సర్వనాశమైనను సరే
సద్యశస్సు గూర్చు పనిజేయు,
మృత్యువు కోరలందు
చిక్కువడి పోయినను సరే,
పెక్కుమంది వినుతి సేసెడి
పని సేయు
ఘనుడౌకండె.

తమిళం - తిరువళ్ళువర్

## తిరగలి

తిరగలీ తిరగలీ
బరువు రాగులు విసరి
అలసి పోయితివేమొ
అమ్మా సరస్వతీ!

## క వి తా క ల్ప క ం

చందనము తెచ్చితిని
చక్కగా నలదుకో!
మొగ్గ దండలు తెస్తి
ముడుచుకో వమ్మ!

కన్నడం - జానపద త్రిపది

## దు ర్భ ర ం

చెలియ సరస నుండ
శీతల మయ్యె,
నాతపము విహగమునకు;
తన్వి లేమి, మంచు వెన్నెలయు
సహించగ రాదయ్యె;
దుర్భరమ్మె ప్రతిది, దుఃఖితునకు.

సంస్కృతం - భాస

## కా త ర

రాతిరి కాగా, భయపడి
నాతని పద్మిని వీడినావు
మధుకరా!
నీ తెన్నున నీ వరుగన్
కాతరమై కనుల మోడ్చి
గనుగొన దారులన్

ప్రాకృతం - అమృతానంద యోగి సంకల్పితం

## మాతృభాష

మాతృభాష నెపుడు
మన్నన సేయుమా:
అదియె మొదలు
గొప్ప లన్నిటికిని.
నీదు భాష తెలియనేరకపోయిన,
హృదయశూల మెటు
హరించగలవు?

హిందీ - హరిశ్చంద్ర

## ఉన్నది

ఆశ లేదు, భయమ్ము నా వంత లేదు;
సరస సల్లాపములు,
విషాదమ్ము లేదు:
నీడ లే, దింత పడుకొన
గూడు లేదు:
నిజమె, కాని విహంగమా
నిలిచిపోకు.
ఉన్నదెల్ల నీ నిజపక్ష యుగళి.
దారి తెన్ను లే దట్టి మిన్ను:
నా చిన్నమాట నాలకింపుము
నీ ఱెక్క లంతలోనె
ముడుచుకొనకు
విహంగమా! ముడుచుకొనకు

బెంగాలీ - రవీంద్రుడు

## ఔదార్యం

పచ్చి పొగరున నిను
గాయపరచి నట్టివారిని
జయింపవలయు,
నపారమైన నీ యుదారతా
ప్రకటననే,
మరొక్కదారి నెన్నడు
త్రొక్కకు ధర్మమిదియె!

తమిళం - కురళ్

## అత్తవారిల్లు

ఆవు వంటి అత్త,
ఆ గోకులము వంటి మామ,
కృష్ణు వంటి మగడు గలుగ,
పుట్టి పెరిగినట్టి పుట్టిల్లు గూడ నే
మరచిపోదు నమ్మ! మచ్చెకంటి!

కన్నడం - జానపదత్రిపది

## వేదన

జనకుడుండెడు నసుస్థాన వేదికజూచు,
జూచి క్రమ్మరబోయి చూడవచ్చు:
స్నానార్థ నియమిత
జలజాకరము జూచు,
జూచి క్రమ్మఱ బోయి చూడవచ్చు:

నిజ హస్త పోషిత
కుజ వల్లికలు జూచు,
జూచి క్రమ్మఱ బోయి
చూడవచ్చు;
కుజ కోటర కుటీర
క్రోడవీథులు జూచు,
చూచి క్రమ్మఱ బోయి
చూడవచ్చు
తండ్రి బాష్పాంగ లేని
సంతాపజలము,
అత్తవారింటి కేగెడు
హార్ద్ర జలము
గోరు వెచ్చని వాలిండ్ల
కొనలు దడుప
అడప దడపను
పయ్యెద దుడుచుకొనుచు.

తెలుగు - పినవీరభద్రుడు

## వి న ప డు నా?

ఎంత చక్కనిదైన
ఎంత కమ్మనిదైన
ఎంత మృదులమ్మైన
ఎంత సదయమ్మైన

పేద వారల మాట
నే దరిద్రుడు వినును?
ఎంత టక్కరిదైన
ఎంత ముష్కరమైన
ఎంత నీచమ్మైన
ఎంత కఠినమ్మైన
ధనవంతుడను మాట
వినిపించు నందరకు.
తప్పెటల చప్పుళ్ళ
ఉప్పెనల ధనధనలు
గుప్పించుచుండ. గిం
గురువోవు చెవులలో
పల్లకీ కలరవపు
పల్లె వెవ్వరు విం్రదు?

సంస్కృతం - స్ఫుటశ్లోకం

పోలికె క్కడ?

బురదగుంటలో
పొరలాడే, కా
సరము జూచినపుడూ:
చగాలుమని, ఏ
కరిం్రదమో నీ
స్ఫురణకు రాగలదా?

ప్రాకృతం - అలంకార సం్రగహం

## స్వభాష

గీర్వాణమ్మని గీష్పతులంతా
గీర్వాణం పోతారూ,
అర్వాచీనములైన భాషలను,
అపహాస్యం చేస్తారూ.
అసలు నిలిచి, హృదయాని కంటునది
అదికాదు, మాతృభాషే.
గీర్వాణం గీర్వాణం అంటే
కూపజలం మాత్రం;
నీవూ నేనూ మాట్లాడే భా
షే, వాస్తవ ప్రవాహ జలం,
నీ వాభాషా మూలంగానే
ఈ విశ్వతత్వ మెరుగుదువూ.

హింది - కబీర్

## వేదన

ఎవ రెఱుంగ గలారు
ఈ హృదయ వేదనా!
ఎవ రెరుంగగ లేరు,
ఈ హృదయ శోధనా! ॥ఎవ॥
ఈ బాధ ప్రణితులే
ఎరుగంగ వలెనమ్మ
ఒరు లెరుంగరు మనసు
వుడికి పోతున్నదే? ॥వవ॥

గట్టులో చేపలా
కొట్టాడుతున్నాను.
ఇట్టె కంటక శయ్య
తిట్టాడుతున్నాను. ॥ఎవ॥
గోపాలుడే నమ్మ
నాపాలి వైద్యుండు,
ఆపవలె నాతడే
ఈ పాడు వేదనను ॥ఎవ॥
మురళీధరుని పైన
మరులుకొంటిని నేను
దరిజేర్పవలె నతడె
తరుణి మీరా ప్రభుకు. ॥ఎవ॥

హిందీ - మీరా

నడువది

కనుగొమ్మరుల గట్టులన్ విడిచి
కొంగల్ బారులం గట్టి
పోయిన నాకాశము వంక:
బోరుమని పోయెన్
బీళ్ళపై గాలి మించిన దర్పోద్ధతి;
లేగ దూడలను వీక్షింపన్
బఱు ప్రాత మెల్లను
కొట్టాలకు బర్వెలెత్తె;
జలదాల్ వ్యాపించె నాకాశమున్.

మంచును దాకి,
పాదముల మాటిన
పారణి పోవనిమ్ము;
పాదాంచల కింకిణీవ్రజపు
టంచులు వీడగనిమ్ము,
నీదు కంఠాంచిత హారముక్తతతి
యిచ్చట నచ్చట
రాలిపోవనిమ్ము!
ఎంచకు మేమి
వేగ గమియింపుము
పచ్చిక బాటలన్ సఖీ.

బెంగాలీ - టాగూర్

## భావుకులు

తన్నసహ్యించుకొను
కన్నవారల కాళ్ళు
కడిగితేనే గాని
కడి పుట్టకుంటే,
కటకటను బడక,
చిక్కటి గుండెతో, నొక్క
త్రుటిలోన చచ్చిపో
వుట మంచి దెప్పుడు —

తమిళం - తిరువళ్ళువర్

## ఎద్దు - పెద్ద

మగడు: పడమిటి గట్లకు
పయనంచేసే
పసి గిత్తలు మావేనే.
పడమటి కొడగుల
పడుచులువానికి
పట్టుదు హారతి పళ్ళెములన్—
భార్య: ఎద్దుల కారతు
లిస్తేమాత్రం
ఏమిస్తాయవి పాపం!
ఎద్దుమీద గల పెద్ద కిచ్చినా
దుద్దుల రవ్వలు పెడతాడూ

కన్నడం - జానపదం

## ధారాగృహం

తలకి గనుగన
గన్నీరు ధార లొలుక,
మేన బేర్చిందు ఉరులంగ
మెలత వొలిచె,
నీలు ప్రిదిలిన జలధార
లోలి గలయగ్రమ్మ, చెదరెదు
ధారా గృహమ్మువోలె.

తెలుగు - నన్నెచోడుడు

పరోపకారార్థం

మంచివాడొక గున్న
మామిడి చెట్టు,
ఫలియించు, పుష్పించు
పరులకోసమ్మె.
ఇటునుంచి రాళ్ళు
వర్షించినగాని
ఫలములే అటునుంచి
పడవేయుచుండు!

హిందీ - తులసీదాస్

ఒ క ఒ ర లో...

ప్రేమరసము నాస్వాదించు
ప్రీతి యొక్కవైపు
బింకమ్మె మరియొక వేపు
చూప తరముగా దెవ్వరికి;
ఒక్క యొరను రెండు
కత్తు లెన్నడు నిమిడిపో
గలుగు నొక్కొ..!

హిందీ - కబీర్

వేటలో పంది పరాక్రమం

ఎగుచు కూతలు
ముట్టె యెత్తి బిట్టాలించి
గమికి గన్నాకయి

గాలి యలము:
వడిగుక్క లంటంగవచ్చిన,
మెడద్రిప్పి ఘుర్ఘురించుచు
బయల్ కొమ్ము జిమ్ము:
తారసించినచోట
దారున జోరబాఱి,
యొకటి రెంటిని
దొబ్బులురుల నడుచు;
బాలచేరులువట్టి తూలింవ,
బలిమి నీడ్చుకొని
డొంకలదూరి చుట్టబెట్టు:
ఈటె పోటులబడి
ప్రేవు లీదులాడ
బోయి,పోలేక దగదొట్టి
పాదలు సాచ్చి,
బెండువడియును
జోరనీదు పీటపెట్టి;
చూపులనె యేర్చు బ్రజ
నొక్క సూకరంబు.

తెలుగు — పెద్దన

## దొడ్డ మనసు

నాళములనుండి రక్త
మింకను స్రవించుచుండె,
నా మేన మాంసము నుండె,
నీకు నాకలియు దీరలేదు
విహంగపతి!
మరెందు కిటు భోజనము
విరమింతు వీవు?

సంస్కృతం - నాగానందం

## జాగ్రత్త!

లలాటమందున
లలనా, కస్తురి
తిలకము దిద్దకు-దిద్దకుమా
పలువ చందురుడు
తుల కాగలనని
చెలి, సంబర పడుతున్నాడు

సంస్కృతం—అమృతానందయోగి

## గొప్ప

కొట్టంలో ఆవు కున్న
గొప్పెంతో చూచావా?
కోడె కొమ్ము కొనపై కను
గొనల గీరుకొంటున్నది.

ప్రాకృతం - గాథా సప్తశతి

## రమ్మ !

దీపమూరక ముట్టించెదేల?
గాలి కారిపోవును;
కాటుక యుంట లేదటంచు
నెవ్వ రెరుంగుదు రబల,
నీవి కారుమబ్బులకన్న
నీలాలు కనులు.
పూలచెండు కట్టకయున్న
పోవనిమ్మ:
గొలుసు చేతికి తగిలింప
కున్నమానె;
మేఘ భరితమయ్యెను నింగి-
మించిపోవు-నున్నటుల రమ్మ.
అలంకార ముజ్జగించి.

బెంగాలీ - రవీంద్రుడు

## వాన

ధర చుట్టూ పా
గరము లున్ననూ,
సరిగా వానలు
కురవకపోతే
కరువే, వరుపే;
మరొక్కటుండదు.

తమిళం - తిరుక్కురళ్

రా నీ !

తిరగలి విచ్చిన
పొరుగింటామెకు
పరమ భాగ్యములు
సరగున రానీ;
మురువుల పల్లకిని
దొరలా పుత్రుడు
మెరవణి కానీ;
విరులు ముడుచుకొని
తెలివ కోడలుగ
బిరాన రానీ

కన్నడం - జానపదగీతం

వేటకుక్కలవి క్రమం

ఇవి. కంఠపాశంబు
లింత దుస్సిన,
మీదబడి దిశాకరినైన
గెడపజాలు;
ఇవి, మింటబఱచు
పక్షీంద్రు జూపిన,
నీడబడి వాలునందాక
బఱపజాలు;
ఇవి, గాలి కనిన,

మూక వరాహదనుజేంద్రుడనైన
జుట్టెంటిలో నాగజాలు;
ఇతి కాటు కొల్పిన,
వృద్ధ కూర్మము వీపు చిప్పైన
నెఱచి కైచింపజాలు; ననగ,
ఘుర్ఘుర గళగర్త జనిత
భూరి భూభృద్దరుబిల భరిత
భాంభా భయంకర రార్భటీ
దీర్ణ దిగ్భిత్తు లగుచు జెలగె,
సరిపెణల బట్టి తెచ్చిన
జాగిలములు.

తెలుగు—పెద్దన

## పల్లె వలపు

జొన్న చేనికాడ
సొగసుకత్తెను జూచి,
నిన్నటాళ నుంచి
నిద్ర రాదు;
దాన్ని నన్ను గూర్చి
దయ సేయు మాధవా!
పొన్న పూలు దెచ్చి
పూజ సేతు.

—తెలుగు

## సూ ర్యో ద యం

ప్రాచీన శైలాగ్రభాగస్థమగు
నశోకంబున చిగురు జొంపం బనంగ;
వర్షాధిపతియని వాసవు గొలువ
జేరిన యింద్రగోపక శ్రేణి యనగ;
ఉరుతర పూర్వ భూధరము నెత్తంబున
బొలుచు గైరిక గండశిల యనంగ;
కాశ్మీరపటమున గావించి సురపతి
విడిచి యూడెడు తూలుబడగ యనగ;
అరుణకిరణుండు దోతెంచె,
నంబుజాతసద్మ నచివ
స్మితా పాదనంబునందు
జతురుడై, యుష్ణకరముల
జక్రవాక తాప ముడుపుట
నాశ్చర్య ధాముడగుచు.

తెలుగు — కేతన

## ప్రేమ లేఖ

నీ మనస్సేమిటో
నే నెఱుంగగ లేను;

నన్ను రేయింబవలు
నవయించు మన్మథుడు;

నా మనసు నామేను
నీ మరులతో నిండె
జాలి లేనట్టివాడా! ఇంక
చాలింతు నే శకుంతలనూ.

ప్రాకృతం - కాళిదాసు

## సూర్యచంద్రులు

వెడలు సూర్యుడు తొలుత,
వెనుక నే చందురుడు
వెనుకముందుగ వీరు
వినువీధి తిరుగుదురు.
ఎల్లలోకముల ద
ర్శించు నా అర్యముడు,
ఏనాటి కానాడె
ఎదుగు నీ హిమకరుడు.

వైదికం - అథర్వవేదం

## ఆ కాంత

వీనులు కనుంకు సొమ్ములు;
వానికి నేత్రములు
జంట వాయని భూషల్!
గాన మఱి వేరుగా
నిం కే నగలో ఏల?
ఈ మృగేక్షణకు చెలీ!

పౌరాణికం - పద్మపురాణం

## ఈర్ష్యేచ్ఛ

పూలదండయే
పడతి జంపుట
నిజమ్మె యయిన,
మెడలోన వేసుకొన్నట్టి
నన్ను జంపదేటికి?
ఈర్ష్యేచ్ఛను
విషమ్మె అమృతమగు:
అమృతమ్మె విషాక్తమగును.

సంస్కృతం - కాళిదాసు

## శూన్యదృష్టి

సుందర యువబృందమ్మున
నెందును నీ మోము
గానిపింపక వగతో,
నిందుముఖి!
నిర్జనాటవియందునబలె
శూన్యదృక్కు
లటు నిటు బఱపన్.

ప్రాకృతం - సత్తసయీ

## తె లి వి

చావు లేనిది తెలివి,
నీ చాయలందె
నిలిచియుండియు
దూరమై నెగడుచుండు:
తెలిసినంతట దాపున
పలుకుసుమ్ము:
కెలకులన్నిట నిండి
కన్నులకు దోచు.

హిందీ - కబీర్

## వె డ లి పో కు

వెడలిపోకుము ప్రేయసీ, చెప్పకయె
వెడలిపోకుము ప్రేయసీ.
కాచితిని రేయెల్ల
కనులు మూతలువడియె
నిదురించినపుడు పో
యెదవంచు వెఱగాను ॥
చలి లేచి నిన్నంట
చేతులను జాపితిని:
కలయేమొ అనుకొంటి
కాంత నాలో నేన ॥

సుదతి నీ పదములం
బొదివి గాటమ్ముగా
నదుముకొంటిని నా
హృదంతరాళమ్మునకు
వెడలిపోకుము ప్రేయసీ, చెప్పకయె
వెడలిపోకుము ప్రేయసీ.

బెంగాలి - రవీంద్రుడు

## నిరీక్షణ

తెల్లవారెను నింగి,
తెల్లవడిపోయినది:
అల్లంతలో స్వామి
చల్లగా వచ్చునని,
మెల్లగా పక్షిగణ
మెల్ల గుజగుజ వోయె:
ఉల్ల మచ్చెరువుతో
జల్లుమని కంపించె:
అల్ల నాథుడు వచ్చు
టెల్ల నిజమేనా?

తమిళం - అంబాళ్

## ఆసలేని మనసు

ఆసలేని మనసు,
మీసములేని మొగమ్ము,
కలతపెట్టు కష్టవార్త:
కాసు వీసములను

కాజేసుకున్న వేశ్యకు
సమానమగు
నిజమ్ము సుమ్ము.

కన్నడం - సర్వజ్ఞమూర్తి

శైలేంద్రతనయ ....

హరినీల మణులకు
నాయువు వచ్చెనా
గమనీయమగు
తను కాంతు లెసగ,
మెఱుగు దీగెలు
గండుమీలపై
నెలసెనా
దృగ్భాసురద్యుతుల్
దేజరిల్ల,
జమర సుకేశ
పాశముల
దుమ్మెద పిండు
దగిలెనా గుటిల
కుంతలము లమర.
కాంచన కుంభముల్
కరికుంభ కర్కశ
మెనసెనా బాలిండ్లు
వానరి తనర

బాప వశమున
శాపంబు వడి,
విహీన జనుల
సంగతి కర్హుపై
పొనరగన్న
యమర సతులోకోయన
దర్శనార్హులైన
యెఱుకు లేమలగాంచె
శైలేంద్ర తనయ.

తెలుగు - నన్నెచోడుడు

ఎవ్వరిదా కలరవం ?

కాళిందీతీరములో
కమ్మగ వేణువు నూదే
కలరవ మెవ్వరి దమ్మా?
పచ్చిక మైదానమ్మున
పలికే పిల్లన గ్రోవీ
పడతీ యెవ్వరిదే.
కలరవమున నా వొడలిటు
కంపమొంది పోతున్నది
కటకట నా వంటకమ్ము
గంగ కలిసి పోతున్నది, ॥కా॥
మురళీ స్వర మెవరిదైన
మురళీధరు డెవడైనా

సరేగాని అతనిపాద
సరోజముల బలియౌదును. ॥కా॥
ఆయన కా సంగీతం
అల నోకయె కావచ్చును
లలనా నా హృదయమెల్ల
వలవంతల పాలయ్యెనె! ॥కా॥
కనుల నీరు కాలువలై
కరిగి వరద లవుతున్నది
కాంతా, మురళీ స్వరముల
కరగి గుండె జారిపోయె:
కాళిందీ తీరములో
కమ్మగ వేణువు నూదే
కలరవ మెవ్వరి దమ్మా?

బెంగాలీ - చండీదాస్

## కన్నీటి వెల్లువ

ప్రవిమలాక్షి సభో
సభ స్త్యాంబుదములకు
నవ సృష్టిధారలై యవతరిల్లి.
ఆకర్ణ దీర్ఘ నేత్రాంభోరుహములకు
గమనీయ నాళ భావము భజించి,
కలిత కజ్జలత
ముక్తాహార లతలలో

హారి నీలరత్న
నాయకత దాల్చి,
లలిత వక్షోజ కుట్మల
చుంబనమ్మున
మధుప దంపతుల
సామ్యంబు వదలి,
వేడి యశ్రులు నిగుడంగ,
వెక్కి వెక్కి యేడ్వదొడగ
లతాంగి, పృథ్వీశు మ్రోల;
మృదుల పరివేదనాతిరోన్మిశ్ర
మధుర కంఠ కాకు వికార
కాకలిక యలర.

—శ్రీనాథుడు

అ హా య క త

చెలువు డెటకో వెళ్ళి
తలకు లలనల చేతి
తళుకు గాజులు పెరుగు
టలు, లోకధర్మమా ?
తెలియ కడుగుచునుంటి
లలన యేమనుకోకు ?

ప్రాకృతం - గాథాసప్తశతి

పరబ్రహ్మ

కమలకోశ సన్నిభమై
కలదు హృదయ, మందులోన
కణకణమను నగ్నిచ్చట
కలదొక్కటి సనలుదేరి;
నీల జలద విద్యుల్లే
ఖా లసితము భాస్వర మది;
సన్నని దది, చక్కని దది,
సున్నత మది. ధాన్యశూక
సునిశితాగ్ర సంకాశము;
పచ్చని దది, పలపల మను
కుచ్చుల మెఱుపుల మిలమిల-
అచ్ఛ మ్మా మంటచివర
ఆడుచుండు పరమాత్ముడు;
ఆయనయే బ్రహ్మయన్న,
ఆయనయే హరియన్నా,
ఆయనయే ఇంద్రుడన్న;
అక్షరుండు, పరముడు, స
ర్వాంతర్యామి, స్వరాట్టు.

వైదికం-యజుర్వేదం

నక్క నాగలోకం

ఎక్కడి కేసరి
　　యెక్కడి నక్క!
ఎక్కడి వారిధి
　　యెక్కడి వంక?
ఎక్కడి పీయూష
　　మెక్కడి హాల?
ఎక్కడి రఘురాము
　　డెక్కడి నీవు?
కుందన మేడ, త
　　ప్పాల రేకు లేడ?
చందన మేడ రా
　　తుస! మట్టి యేడ?
మదగజ మ్మెక్కడ,
　　మార్జాల మేడ?
కదన భీకరు డేడ,
　　కపటి నీ వేడ?
ఖగపతి యేడ కొం
　　గల పతి యేడ?
సొగసుల నెమ లేడ
　　సొరపిట్ట యేడ?

రాయంచ యేడ, గృ
ధ్ర మ్మేడనోయి?
ఆయన యేడ పా
పాత్మ నీ వేడ?
(సీత, రావణునితో)- సంస్కృతం వాల్మీకి

కావ్యం

శాస్త్రములలోని
సారము,
జన పదముల
జీవనమ్మున గలిసిన
తావి,
కథల పలుకు తీరున
గల చేవ,
కలసిపోయి—
కావ్యమన్నట్టి పేర
విఖ్యాత మగును.

ఆలంకారికం-అగ్నిపురాణం

భ్రమ

అంతరమందు వెల్గు
పరమాత్మ, ననంతుని నిన్ను
మూర్ఖు లావంతయు
గానలేక, మదనాంతక!

తీర్థములందు నెల్ల
గాలింతురు:
గొంతుకన్ వెలుగులీను
చిరంతన రత్నమున్,
భ్రమాక్రాంత మనస్కులై
వెదకగా. గమకింతురు
దుమ్ము ధూళిలో.

సంస్కృతం-జగన్నాథ పండితరాయలు

## ఆత్మజ్ఞానం

తన్ను దాను
దెలుసుకొన్నట్టి
సుజ్ఞాని,
అన్ని గూడ
దెలుసు కొన్నవాడె;
అన్ని గూడ
దెలుసుకొన్నట్టి
విజ్ఞాని,
తన్ను దాను
దెలుసుకొన్న వాడె.

పాళీ-ఆచారాంగం

## తలపు

నూరు సారులు
ముద్దుల నూరవేయు,
వేయిసారులు కౌగిట
వెచ్చజేయు,
ఆపి, ఆపి మరింతగా
నూపివేయు,
లేదు పునరుక్తి
వలపుల మోదులోన.

ప్రాకృతం-సత్తసయీ

## వినయం

సరస హృదయమ్ముతో
రసాస్వాదబద్ధులు
చిత్తమున,
పారవశ్యము జెంది మసలు
మాన్య పురుషుల
పద పద్మ మహిత ధూళి
దాల్చి నా మస్తకమ్మున
ధన్యుడగుదు.

హిందీ-ధ్రువదాసు

# గుండియగుసగుస

వన్నెలాడి వడివడిగా
తెన్ను దూసుకొని పోగా,
కన్నె పైటచెఱ గొకింత
నన్ను సోకెనూ.
అట్టడుగున గుండెలలో
చిట్టచివరి గుట్ట వెడలె
నిట్టిమధుకవోష్ణమైన
చిట్టి యూరుపూ,
తాకీ తాకని, ఏ చిఱు
తాకో అతి మృదులముగా
నా పై దపిలి మాయమయ్యె
సోకి సోకకా,
రాలిపడిన పూవు రేకు
గాలి యలల నూగునట్లు
బాల మృదుల నిశ్వాసో
ద్వేల లీలగా,
కులుకులాడి గుండియ యం
చుల గుసగుస వోలిన-ఆ
వలిపము నన్నొరసి పోయె
నలతి యలతిగా.

బెంగాలీ - టాగూర్

## కలగంటి

కలగంటి చెలియా—
వలపుల దొరనూ
కలగంటి సకియా ‖కల‖
కలగంటి కలకంఠి
కలలోన వినగంటి,
చెలి! పాంచజన్య చం
చల ఘోష లారవము ‖కల‖
కలగంటి పొదరింటి
చలువ పూవుల మింటి
కెలన నిలుచున్న సొం
పుల సామి కనుగొంటి ‖కల‖
వలపుల దొర నన్ను
కులుకు చూపుల జూచి;
అలవోక చెయివట్టి
పులకింప జేసెనే—
కలగంటి చెలియా
వలపుల దొరను-
కనుగంటి సకియా.

తమిళం-అండాళ్

## గడన

గడనగల
మగని జూచిన
అడుగడుగున
మడుగు లిడుదు
రతివలు, దమలో
గడ నుడుగు
మగని జూచిన,
నడిపీనుగ
వచ్చెనంచు
నగుదురు సుమతీ.

తెనుగు — బద్దెన

## త్యాగము

త్యాగమ్ము లన్నిటం
దాన ముత్తమము;
దానపరు మీదనే
మానవులు బ్రదుకుదురు;
తలసూపగలరే, వ
దాన్యునకు శత్రువులు?
శత్రువుల గూడ నీ
మిత్రులనుగా జేయు

వైదికం — తైత్తిరీయ-ఆరణ్యకం

## వర్షంలో ప్రజా ఘోష

ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బ శిఖి:
అబ్బె నేనింటిలో బూరి యిడి
విసరక రాజదు:
రాజిన రవులుకొ ల్పొసలెగాని
కల్గదు గూడదాన:
కలిగనేని కూరగుట మందు:
ఐన బెస్ పొగ సుఖభుక్తి
సేకూర దాభుక్తికి:
ఇడిన బ్రాగ్భక్తులకె దీరు
బహు జనాన్నము,
తీర నారుల కొదవు
బునః ప్రయత్నము:
ఆజ్యపట ముఖ్యులయు మెన్నరు
ఆలయాంగదాసు లయు మెన్నరు.
అంతిక కారజనిక పచన
నాంధ్రో గృహిణి రామి
బడుక మరుడు
వెడవెడనె యూర్వ నొగిలిరి
అజ్జడిని గృహులు.

కృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యద

## మనస్సంక్షోభం

నా కొక వైరియున్నా డనుమాటె
చీకాకు పరచు నన్ సిగ్గిల జేయు;
అందున నా వైరి యడవులలోన
కందమూలాశియై గడపు తపస్వి;
నా లంకకే వచ్చి నా దైత్యకులము
మూల మట్టముగ
నిర్మూలించుచుండె
నింతైన నేను జీవించియే యుంటి
ఏల దేవేంద్రు నిర్జించిన కొడుకు?
ఏల మేల్కొన్నట్టి యింత
తమ్ముండు ?
నాకపురీ విలుంఠన వృథోచ్ఛూన
భీకర మీ భుజావింశతి యేల ?

సంస్కృతం - మహానాటకం

## చంచల

చంచల లక్ష్మియ
టంచు నిజమ్ము వ
చించినవా రెవరూ ?
ఎంచి పురాణు వ
రించిన కోమలి
చంచల కాకేమగునూ ?

హిందీ - రహీం.

## సమన్వయంలేదు

ఈ రెంటికి సమన్వయం
ఎటూ కుదరకున్నదే ?
వంచించక బ్రతుకలేను;
వంచించిన బ్రతుకు చెడును;
ఎలా యింక సమన్వయం ?
ఎలా నయ్యా రహీమూ ?

హిందీ-రహీం.

## నేస్తు

నీ కనుల దొరగు క
న్నీటి నొక మారైన
నెనరుతో తుడుచు నా
నేస్తు మరవకు మెపుడు.

తమిళం - తిరువళ్ళువర్.

## ఎందుకో :

ఎందుకో యీ సుమ
మ్మిటు వాడిపోయె;
గదుము నుత్కంఠతో
నెద కదుముకొన్నాను;
అందుకే యీ సుమ
మ్మటు వాడిపోయె.

ఎందుకో యీ దీప
మిట్లారిపోయె ?
గాలి తాకు నటంచు
దూలి కప్పితి వల్లె;
అందుకే యీ దీప
మారిపోయినది.
ఎందుకో యీ కావ్య
మెండిపోయినది
అనుభవించెదనంచు
అడ్డు కట్టితి నేమొ !
అందుకే యీ కావ్య
మట్లెండిపోయె
ఎందుకో ఈ తంతి
యిటు తెగిపోయె ?
మోటుగా పైస్థాయి
ప్రోగించ బోయితిని !
అందుకే యీ తంతి
అటు తెగిపోయె !

బెంగాలీ - టాగూరు.

కామం

హాలాపాన
విజృంభమాణ ప్రమద
గర్వాతీత దేహోల్లసత్
బాలాలోకన సృఖింలా నిచయ

సంబద్ధాత్ముడై
లేశమున్, వేలా నిస్సరణంబు
గానక మహావిద్వాంసుడున్
కామినీ హేలాకృష్ట కురంగ
శాబక మగున్
హీనస్థితిన్ వింటిరే!

తెలుగు - పోతన.

క్షామంలో జనక్షోభ

గునుకు, లూదర్లు, బరపటల్,
గోళ్ళగుండు, లల్లిబియ్యంబు,
వెదురు బియ్యంబు, గొట్టిచెట్లు,
నింజెట్లు, తుంగ ముస్తియలు,
నీతగుజ్జు మొదలుగా
దినదొర కొనియె జనము.

తోలును నెమ్ములున్ మిగిలి
ద్రోసిన తొంబదిచోట్ల గూలువారు,
ఆలిన్ బిడ్డలన్ విడిచి
యాకటి చిచ్చున వెచ్చపోవు వా,
శేలిక బంటువాసి
యొక యించుకలేక కృశించు వారునై
తూలె జనంబు
మీన శనిదోషము దాకి
నిరస్తసస్యమై.

నవయుచు నుండియు, నొక్కొ_క
దివసంబున నశన మబ్బ దిని
దగమిగులన్ భువినొరిగి
లేవనోపక శివశివ!
జనకోటి విడుచు జీవానిలముల్.
కటా, వంతంతకు నొత్తగ
గరవెరుక తినంగ నోప గలుగక
మనుజుల్, సురసుర స్రుక్కి-రి
కొందరు పరదేశంబులకు
జనిరి బ్రతుకులకొఱకున్.

తెలుగు - ధూర్జటికవి.

శివభక్తులు

అంత్యజుఁ డంత్యజుఁ-
డనుచుఁ గుయ్యిడెద,
రంత్యజునకుఁ జొర-
నది యెట్లు వచ్చు
నరుదగు మీయట్టి-
యగ్రజన్ములకు,
హరభక్తులిందులు-
చొరఁగరా దనగఁ
గన్నులు గానరు_
గా కింటిలోన,

నెన్నంగఁ గులహీను-
లిట్లున్నవారె?
రుద్రభక్తులయిండ్ల-
రూఢిఁ బ్రత్యక్షు,
రుద్రులు గాకేమి-
క్షుద్రు లున్నారె?
మాహేశ్వరుల నిజఁ
మందిరంబులను,
మాహేశ్వరులె కాక-
మనుజు లున్నారె?

తెలుగు-పండితారాధ్య చరిత్ర.

సంప్రదాయం

పూర్వు లున్న తీరు పోల్చుకో,
తర్వాతివారి తీరు నెరిగి
దారి గనుము;
నరుడు సస్యమట్లు
పరిపక్వమందును;
సస్య మట్లె తిరిగి
పసిని వేయు.

వైదకం - కఠోపనిషత్తు.

ఊరట!

న న్నపహసించువారి
విజ్ఞానమెంత?
వారికై కాదు దీని

నే వ్రాయుచుంట:
ఎవడో నావంటివాడు
జన్మించి తీరు,
కాలమున కంతులేదు !
విశాల మవని !

సంస్కృతం - భవభూతి

## మి గి లి న ది

నీ పువ్వొకటి కోసి
నిండు ఎడంద కదుముకుంటిని॥
దానియందున్న ముల్లు
గ్రుచ్చుకున్నది:
ప్రొద్దుగుంకి, చీకటులు
క్రమ్మిన యంత
పుష్పమ్మెమొ వాడిపోయెను?
నొప్పియట్లే యుండిపోయె.
వలపు లీరిక లెత్తు
తలిరు పూలెన్నొ
నీ వని కుసుమించు నింకను;
నాకు సుమములు కోయు
కాలము గతియించె:
నా గులాబీ పోయె:
నా నొప్పిమటుకు
నిలిచిపోయెను జననీ జగద్ధాత్రి!

బెంగాలి - రవీంద్రుడు

## దేశభక్తి

పెద్ద మట్టిబొమ్మలలోనె
వెలసె దైవమనుచు
కొందరర్చింతురు;
కానుగాని,
నా భరతభూమి
ప్రతి మంటినలుసు ముందు
నే పరమభక్తితో
ప్రణమిల్లుచుందు

హిందీ - ఇక్బాల్

## జడివాన

పచ్చిక దట్టమయ్యె;
క్రిమి పంక్తులు
వందలు వేలు నయ్యె;
పై పెచ్చు దుమారమెల్ల
పృథివిం జారె
శీకర సిక్తమై;
ధరాభృచ్ఛయ, మాపగల్
జల పరీతము లయ్యె;
ఝరీ తరంగముల్
ముంచిలె లోకమెల్ల;
తల మున్కలుగా
జడి గొట్టె నంతటన్.

పౌరాణికం - వ్యాసమహర్షి

జన్మ జరా మరణ క్లే
శమ్ములు లేనట్టి నెలవు;
దుఃఖ దుర్దశాభీతికి
దూరముగా నున్న తావు,
నిర్వాణము, నిర్వాణము
నేను కోరుకొందు నదే.

లౌకికం-అశ్వఘోషుడు

కవితా సామాగ్రి

ప్రకృతి సిద్ధమైన ప్రతిభ,
పాండిత్యమ్ము,
కలత పడని
భావుకత్వ గరిమ,
నిత్యకృత్యమైన
నియత పరిశ్రమ—
కవిత కెంతో చేవ
గలుగజేయు.

ఆలంకారికం - దండి

కట్టా !

నిట్టూరుపుతో
రాధిక చిట్టి పెదవిమీది
దుమ్ము చెఱపితివి సరే!

కట్టా! అట్టే సవతులు
పెట్టుకొనిన ఆశలెల్ల
పెకలించితివే?

ప్రాకృతం- సత్తసయీ

## ఊహాతీతం

ఊహ జేసి కనుగొన్నది
బాహిరమే ఎన్నడైన!
మోహపడకుమోయి! అంత
రాహితమై నట్టిదాని
నూహింపగ లాడనంచు?
సాహస మది సఖుడా విను.

హిందీ - కబీర్

## ప్రభోధం

పనులు ముగియింపు మమ్మా! అతగాడు
చనుదెంచినాడు సుమ్మా!
గడియ మెలమెల్ల, సం
దడి సేయుచున్నాడు;
వడివడిగ తలుపునదె
సడలించుచున్నాడు.
గట్టిగా నందియల
నిట్టె మ్రోయించకుము.

చిట్టి ఆతని డాసి
తొట్రుపడ బోవకుము.
పను లు ముగియింపుమమ్మా! అతగాడు,
చనుదెంచినాడు సుమ్మా!

* * *

ఇది ప్రభంజనము కాదే! సుందరీ,
అదిరి పడిపోవరాదే!
వాసంత పూర్ణిమను
భాసించె చందురుడు,
మాసిపోయెను, గుడిసె
మోసలను నీడ లివె.
వెలుగు లీనుచునుండె
వెలది గగన మ్మెల్ల
చలియించు నా గుండె?
వెలిగించు దీపమును.
ఇది ప్రభంజనము కాదే! సుందరీ,
అదిరి పడిపోవరాదే!

* * *

పను లింక ముగియించవే! అతిథియే,
చనుదెంచినాడు గదవే!
దివ్వె వెట్టగలేదు.
పువ్వు లుంచగలేదు.

జవ్వనీ నీ సొగసు
లెవ్వి కానేలేదు.
పసులింక ముగియింపవే! అతిథియే.
చనుదెంచినాడు గదవే!

బెంగాలీ — టాగూర్

## ప్రేమ

ఎంత హృదయ విహీనమో
ఏమొ గాని.
ప్రేమ నన్ ముప్పు తిప్పల
బెట్టుచుండె:
నట్ట నడిరేయి గూడ
నన్నదిమి పట్టి,
గుండె, గుబ గుబ
లాడించుచుండె నకట,

తమిళం - కురళ్

## మాల

మాల మాల యంచు
గోల పెట్టెద వేల?
మాల మాత్రమేమి మనిషి కాదె?
మాల గాని వాని మైగోసి చూడ,
రక్తమ్ము గాక
పాలు గారునేమి?

కన్నడం - సర్వజ్ఞుడు

## ఇరువైపులా....

మునుపు సైపదు
సంతోషమున భుజింపః
వెనుక సైపదు
చింత చేతను భుజింప;
బాల కడ నున్న యపు,
డెడబాసి నపుడు
నొక్క తీరయ్యె
భరతవంశోత్తమునకు.
ఎక్కడ జప్పుడైన,
దరలేక్షణ
వచ్చు నటంచు లేచు;
నే దిక్కున నల్కుడైన
సుదతీమణి పల్కని
యాలకించు;
నే చక్కి దళుక్కుమన్న
నెల జవ్వని
మైసిరి యంచు జూచు,
నమ్మక్క!
కిరీటి మోహా సముద్రగత
నే మనవచ్చు నయ్యెడన్.

తెలుగు - చేమకూర వేంకట కవి

## ఆదర సంభాషణలు

దయ చిప్పిలు మాటలలో,
దాగివున్న రుచి చూచిన
దౌర్భాగ్యం డెవడైనా,
దయాహీన వాక్యమ్ముల
దర్పంతో అనగలడా?

తమిళం - తిరువళ్ళువర్.

## శి శు హృ ద యం

ఏడ్చు బాలుని పెదవి
యెఱ్ఱపగడపుఱ్ఱోవి;
వాని కన్బొమలు వే
ప చిగుళ్ళ చిఱుకొనలు;
వాని చూపులు శివుని
వాలువలె తీక్ష్ణములు.

కన్నడం - జానపదగేయం

## సూ ర్యా స్త మ యం

రవివర బింబ
మూర్ధ్వగత రశ్మికమై,
పరిలంబమానమై
వరుణహారి ద్వధూటి. తగ
వార్ధి తోయము చేదు వేడుకం
గరపరి ముక్తమైన

కనకంపు ఘటంబన,
జక్రవాకికా విరహ
కృశానుకూట మన
వీక్షణ దృశ్యత నొందె
నెంతయున్

అయ్యలార్యుడు - భాస్కర రామాయణం

తొందరపాటు

తన అలంకార రచనలో
మునిగియున్న
కొమ్మ, ప్రియురాక విని లలా
టమ్మునందు
కజ్జలముదిద్దె, లత్తుక
కనుల వెట్టె,
తిలకమును కపోలమ్మున
దీర్చుకొనియె

— సంస్కృతం

ఎదదలో....

హోరెత్తే బోరుగాలి
దారుణ పర్జన్య ఘోష
నీరదమాలా జాలం
కారు చీకటుల శూన్యా
గారం నా హృదయంలో
డేరాదించినవి సఖా.

— హిందీ

## ఉండదు!

ఖర్చుదారు సొమ్ము
  కలయ జల్లునుగాని
పట్టినాటకమ్ము:
  పట్టుమంచు
పది దినాలు కూడ
  పనికి రాదది, మాయ
మగును చూచుచుండు
  నంతలోనె.

తమిళం - కురళ్

## ఉత్సవం

కనకంపు గ్రోళాలు
  గొనిముంచి కాశ్మీర
జలము లొండురులపై
  జల్లువారు.
గరయంత్ర మాదిగాగల
  జల యంత్రాలి
నోలి నొండురులపై నొత్తువారు.
  మెలుపారు తలిరుల
గలకంపు బువ్వుల
  వలగొని యొండొరు వైచువారు,

కర్పూర చందన
　కస్తూరి మృగవంక
ములుగొని యొండోరు
　బూయువారు,
పట్టి పెనగువారు,
పట్టీక రయమున బాఱువారు,
నెగచి పట్టువారు—
ప్రణయ భావమెసగ
బౌరు లుత్సవమున
గూడి నీరు పోత లాడి రొప్ప.

తెలుగు - నన్నెచోడుడు

ధైర్యం

బుద్ధీంద్రియ క్షోభములకు బెట్టనికోట
విషదంబు రాశి దుర్వికృతి కోడ
ఖల దురాలాప మార్గణ
వజ్ర కవచంబు
రణమహాస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వ సంస్తభ నౌషధి
మొనయు చింతా శ్రేణి మూకవిప్లు
యోగాది సంసిద్ధు
లొనగూర్చు పెన్నిధి
తూలు నేకాకుల తోడునీడ
సకల సుగుణ ప్రధానంబు

సకల కార్యజాల
సాఫల్య కరణైక సాధనంబు
ధైర్యగుణము:
అట్టి ధైర్యంబు దక్క
పోర దత్తజెంతురె?
అకట మీ తరమువారు!

తెలుగు - పెద్దన

ఋతరి

ఇరుల దరిమి
వేసి, వెల్గు
పారల ఋతర
థమ్ము నెక్క,
అరుదెంతువు
బృహస్పతీ!
అరుల నుఱుము
భీషణ మది
పరిమార్చును
రక్కసులను
నర రథమ్ము
గోత్ర భిదము
పరమ స్వ
ర్విద మయ్యది.

వైదకం - ఋగ్వేదం

## సౌందర్యం

ఈ లావణ్య పయోధి
నూత్న:
మిట్టనెంతే గల్వలున్,
చంద్రుడున్ దోలా క్రీడ
యొనర్చుచుండి
రిది ఏదో సంద్ర
మిచ్చోటనే
దేలున్ మున్గ
గరీంద్ర కుంభ తట;
మీ దివ్యాబ్ధిలోనే
మృణాలాలన్ గూడి
యనంటి కంబములు
లీలా లాస్య
ధుర్యమ్ములౌ.

సంస్కృతం-ధ్వన్యాలోకంలో ఉదాహృతం

## గృహం

పోరు పొచ్చము లేని
సంసారి యెపుడు.
పొందవచ్చు స్వర్గము,
ముక్తి నందనచ్చు;
అందికయు

పొందికయు లేని
యట్టి యింట నున్న
సాధించునది
ఏమి యుండు నింక?

—నీలకంఠ దీక్షితులు

## సీ త

సీత కను దోగ
రాము వీక్షించి నంత,
వాలిపోయిన రెప్పల
తూలి పోయె;
కాని, ఆతని
'జవము' చక్కందనమ్ము,
వెలుగు గనుగొని
తమ యంత
విచ్చు కొనియె.

—జగన్నాథుడు

## ఆ మ ని

కన్నెల నెమ్మోములల
క్ష్యములను నిల్పి
అన్ననా! ఆమని అం
తంత నాగకా,

గున్న మావిమోక చివురు
కొత్త యమ్మనన్
వన్నె కాదు మరునికి న
ప్పణము పెట్టునే!

ప్రాకృతం - గాథ

## వలపు బలిమి

ఎన్ని అడ్డు లున్న
నెంత దుర్బలమైన
ఎంత కగుణ పాత్ర
మేని అయిన—
ఉవిద,
వలపు గొన్న
నొక్కటి యాపునా?
తెరనుదీసి వలపు
తురగలించు.

తమిళం - కురళ్

## దానశీలత

కారే రాజులు
రాజ్యముల్ గలుగవే
గర్వోన్నతిం బొందిరే
వారేరీ?
సిరి మూట గట్టుకొని
పోవన్ జాలిరే!

యుర్విపై బేరైనం
గలదే?
శిబి ప్రముఖులున్
బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు?
వారినిన్ మఱచిరే
యిక్కాలమున్ భార్గవా!

తెలుగు - పోతన

ధ్రువం

మనసు కంటె
వేగవంత
మైన ధ్రువ
జ్యోతి అదో
అను గతి
శీలముల నడుమ
మునుకొని
దారిని చూపును;
ఎనసి ఏక
చిత్తముతో
మొనసి ఏక
లక్ష్యముతో

అనయము క్రతు
ముఖులై చ
య్యన చనుదురు
దేవులెల్ల.

వైదికం-ఋగ్వేదం

భారశబలత

కనులు విప్పార్చి
అంజన కన్నకొడుకు,
సీత జూచితి నని
ముందె చెప్పి వేసె.
తన ప్రయాణమ్ము గూర్చిన
తలపు లెల్ల
చల్లగా తరువాత నే
సంగ్రహించె,
సీత జూచితి
నను వార్త చెప్పె గాని,
నమ్మలేదు రాముడుముందు-
నాతి చిక్కి చివికి
యున్న దటం చని
చెప్పినంత,
దద్దరిక తోడ
నిట్టూర్చి కనలె నతడు.
ఇంతి నీ కొరకై

విలపించుననగ,
రఘుకులోత్తము
డశ్రువుల్ రాల్చి నిలిచె;
నిన్ను నమ్మి
జీవించుచు నున్నదన్న
బొదివి కొనియె
నక్కున
వాయుపుత్రు నంత.

సంస్కృతం - సేతుబంధం

## ఉదయం

మాసిన యద్దమట్లు
చరమాశ గనంబడె
చందమామ;
కూర్మాసను వీడ్చి
సర్ప మటు ప్రాగ్దిశ
చీకటి డుల్చె;
కోనలున్
పూసిన తమ్మిలెత్తి
కను మూతలు విప్పెను;
మేలు కొల్పులన్
దూసుక వచ్చు

తుమ్మెదలు
దోయిలి పట్టెను
సూర్యమూర్తికై.

—రత్నేశ్వర ప్రసాదనం

## తె లి వి

తెలివిమాలిన
తనమున,
దెలియలేడు
తెలివి లేనట్టి వాడు—
అన్ని తెలిసి నట్లె
తిరుగుచుండును:
తన కన్ని
తెలుసు నన్న
పొగరు గలవాడు
మూర్ఖుడే పొమ్మ
తండ్రి.

పాళీ - ధమ్మపదం

## భ క్తి

కనులు మూసి యో
గము లేలా?
సత తాంగ న్యా
సము లేలా?

తలచి పాడి నృ
త్యము సేయన్,
వెన్నుడుండు నీ
వెను వెంటన్.

హిందీ - వ్యాసజీ

## పసితనం

పసిపాపల
  తొక్కు పల్కు
పసదనమ్ము
  నెరుగని వా
రసదృశమని
  మురళి రవము
నాదరింతురూ—
పసిపాపల
  పలుకు కంటె
ససిగల గీ
  తమ్ము లేదు;
పసి పాపల
  ముద్దుకంటె
పండుగ లేదూ.

తమిళం - కురళ్

## నీతులు

చెల్లియుండియు
సైరణసేయు నతఁడు;
పేద వడియును
నరికిఁ బ్రియముఁతోడ
దనకు గల భంగి
నిచ్చు నతండు—
బుణ్య పురుషులని
జెప్పి రార్యులు
బుధవరేణ్య,

*

కడు నమ్మ
యునికియునుఁ
నమ్మమియును సుశీల!
కుశలత కాదు;
ఎయ్యెడ నైనను
బుద్ధి సానిపి
తడవి
కనుగొనంగ వలయు
దగవు ధర్మమున్.

తెలుగు - తిక్క

## ఉషోగీతం

పగటి తొగరు
  దెలుసుకొన్న
మగువల మిన్నా,
పొగ చీకటిలో బుట్టుచు
రగిలెడి కన్యా;
నగుచు జేరు
  సంకేతము
మగనికోసమై,
తగని దారి
  నడుమ దెపుడు
జగతి నుషస్సా.

వైదికం - ఋగ్వేదం

## అలుక

చెక్కిట జెయి జేర్ప
  జెఱగె బత్రములు;
ఉక్కెర కెమ్మోవి
  నోడ్చె నిట్టూర్పు;
నెక్కొనె గొంతుక
  నిండు కన్నీరు;
చిక్కటి చన్గవ
  చెదరించె నేడ్పు;

అక్కట అల్కయె
ఆటంకమయ్యె....
చక్కెర బొమ్మ మా
సంగతే లేదు!

సంస్కృతం - ముక్తకం

అక్కటా!

ఏడి నీ కింక
చేయూత నిచ్చు
కొడుకు?
కనులుపోయెను
గద నీకు!
కనికరమ్ము వీడి
ఁ..ము దున్నటులె
లాగివేసె నకట!
అంధుని
కరాలవంబన
యష్టి నిట్లు!

—అమృతానంద

ఎందుకిది?

కామనల మాన్పి,
జగము జగమ్మటంచు
దలచి

యల్లాడు చిత్తమ్ము
నిలిపి యుంచి,
ఎడద శివు నిల్పి
ఏ మూలనేని జేరి
యుండుదుము గాక!
ఏల యీ బండగోల!

—అలంకార సంగ్రహం

## మోహనం

గోకుల మంతయు
మోహనమే;
గోపిక లందరు
మోహనులే;
గోకుల యమునా
కుంజ నికుంజము,
గోప కిశోరము
మోహనమే.

హిందీ - శ్రీభట్ట

## గొడవ లేదు!

మంచి చెడ్డ దెలిసి
మనువారి కన్నను,
జ్ఞాన హీనులైన
జనులె సుఖులు;

ఏది చేయువలయు
ఏది కూడదటన్న
కలత, వారి కెపుడు
కలుగబోదు!

*

## అదే ఆశ

మా వలపు గూర్చి
గుస గుస వోవుటలే—
ఆశ కింత ఊపిరి బోసెన్,
జీవితము నిలిపె
చెలి!
ఈ పోవడి లోకులకు
దెలియబోమి మంచిదే.

తమిళం - కురళ్

## తీర్పునా?

నావలచుట్టి
హర్షకలనా వలమాన
మనోంబుదంబుతో
నా వలవైరి బల్కు
నచలాగ్రణి మామక
శోకవార్ధికిన్
నావ లతాంగి.

నబ్ధి రశనా వల యేశ్వరు
కేల గూర్చెదే!
నా వల పంత దీర్చెదె!
యనంత కృపారస
వాస వాసవా!

తెలుగు - భట్టుమూర్తి

తత్త్వం

ముల్లుతోడా నేను
మూడు చెలిమలు తీస్తి
రెండు చెలిమలు వట్టిపి— మూడోది
నిండినది వట్టి యిసుకా.
ముగ్గురూ మగవాళ్ళు
మూడు చెలిమలు తవ్వ
ముద్దుగా వచ్చినారూ—వారికీ
మొండిచేతులు పాపమూ;
మురపెముగ యిసుకతో
ముగ్గురూ కుమ్మరులు
మూడు కుండలు చేసిరీ—వారికీ
మొండిచేతులె సత్యము,
మూడు కుండలలోన
జోడుకుండలు, పచ్చ;
మూడోది కాలలేదూ—పచ్చిదే
చూడవే చోద్య మక్కా—

తమిళం— జానపదం

## తిల్లాల్లో....

ఏడు చింతాచెట్లు తిల్లాల్లో
ఏడు చింతలయెదుట తిల్లాల్లో
జోడొకటి వున్నాది తక్కా తక్కా
ఆడికెళ్ళిపోదమే పిల్లా పిల్లా
జోడంటే జోడటే పిల్లాపిల్లా
జోడైన వేసలే తక్కా తక్కా

తమిళం - పాతపాట

## ఎంత కోమలమో!

సెలవటంచు ప్రియుడు
చెప్పగా, నెలత కెం
గేలి గా జోకందు నేల రాలె;
వెళ్ళునరీచు (జెప్ప
వెంటనే మిగతవి
చిట్లిపోయె నామె చేతినుండి

— సంస్కృతం

## జయగీతం

అకర్మణ్యాడీ దస్యుం
డనపత్యా డమానుషుడు—
అడుగో మన చుట్టు ముట్టె
నతగానిని బరివార్చుము!

*

పగవారి నెదిరించి,
పగల నన్నిటి ద్రుల్చి,
మగటిమిని బాధకుల
పొగరు నడగించుమూ.

*

నీ ఆయువు పట్టుల నే
నిదిగో కవచమున దాతు;
నీ కమృతత్వమ్ము నొసగి
సాకు గాక సోమరాజు;
మగలలోని మొనగానిగ
నెగడించును వరుణు డింక;
జయముగన్న నిన్ గని జయ
జయ యందురుగాక సురలు.

వైదికం - ఋగ్వేదం

యమకాలు

యమకాదుల గూర్చుటన్న
యతనము సేయక తప్పదు,
అతి సమర్థుడైన కవే
అయినప్పటి కైనా,
అందుననే వానికి, కా
వ్యాదు లందు రసాంగత్వ
మున్నది సిద్ధించ దందు
రాలంకారికులూ

ఆలంకారికం - ధ్వన్యాలోకం

## విరహం

మిన్ను మిన మిన నలుపున
మెరిగిపోయె;
ఎగయు కొంగల
మబ్బులు బిగువు సూపె:
గాలి మంచును జిలికె;
కేకలను వేసె
సంబరమ్మున నెమలి
యంబుదము జూచి;
ఇట్టి వెన్ని యున్నను సరే!
వట్టి కటిక గుండెగల
నేను సహియించి
యుండగలను___
కాని. జానకి
ఏమి కాగలదో అకట!
భూమిజా! సీత!
ధైర్యము బూను మింక!

సంస్కృతం - భవభూతి

## చెల - నెల

చెలి చెక్కిలి
వర్ణించుచు.
నెలవంకను
వోలు ననుచునే

యుందురు లే—
అల వా టది;
నిజ మెంచిన
నెల వంకకు పాప
మింత నిగ నిగ యేదీ?

ప్రాకృతం - గాథ

జా జి - జ వ్వ ని

పూలలో నెల్ల
మెత్తని పూవు నీవు:
కుసుమములలోన
ఉత్తమ కుసుమ మీవు;
కాని, ఓ జాజి! నీ కన్న
కలికి మిన్న-
కోమలాతి కోమల
యన్న కోప పడకు.

*

కొ లు వు

కను పాపా! నీ వెటకో
కదలి పొమ్మికా.
కలికి నచట నిలునబెట్టి
కొలువ వలయునూ.

తమిళం - కురళ్

## తుమ్మెదలు

వన తరువల్లికా
కుసుమ వాసన లోల్లక,
శైల కన్యకా ఘన
ఘన వేణికా భరము
కమ్మని తావికి జిక్కి,
క్రొమ్మాయు చూస్
వెదుచనియెన్
ద్విరేఫములు వేమఱు
భావి వియోగ చింతచే
వనరుచు వెంటబోవు
మహీవల్లభు చూపుల
ప్రోవులో యనన్.

తెలుగు - భట్టుమూర్తి

## జిజ్ఞాస

ఎవరికి తెలుసు నిదంతా
ఎవరు చెప్పగల వారలు?
ఎటునుంచీ పుట్టె సృష్టి?
ఎటు వచ్చినదీ విసృష్టి?
దీని వెంటనే పుట్టిర
దేవ దేవు లందరునూ?
దీని జన్మ మెపుడో మరి

దీని దెలియు జ్ఞానులెవరు?
ఈ విసృష్టి ఎవరి నుండి
ఏర్పడెనో ఈవిధముగ?
ఆయన సృష్టించాడా?
అటువంటి దదేమి లేద!
ఆకాశం పైన నిలిచి
అంతటినీ పరికించే
ఆయన కీ తత్వ మంత
అవగతమో కాదో మఱి?

వైదికం - ఋగ్వేదం

## త ప్పె వ రి ది ?

పసులకు నయ్యు పీడనపు
బాధల నందును;
భంగ మయ్యు
మాధురి దొలకించు.
వక్రతను దోగియు
నందర మెప్పు గాంచు
చక్కెర గడ—
పాడు తావున
నొకించుక పెంపు
వహించకున్నచో,
చెఱకును దిట్టు రెట్లు?
కలుషీకృతమా
మరుభూమి దిట్టకన్?

సంస్కృతం - స్ఫుటశ్లోకం

## ఇవ్వలేని బ్రతుకు

"ఎవరి వీవు పాదపమా?
ఎవరవు?"

"విధి దష్టమైన
వల్లకాటి చెట్టు నయ్యా
కల్ల కంసనూ,"
"విసుగు జెంది నటులున్నది
వేసట యెందుకు?"

"నిజమే
వేసట గా శే మున్నది?"
"వివర మేమిటీ?"
"దారికి దూరమ్మైనా
సారెకు నా మట్టి చెట్టు
చాయకు జేరుదు రదిగో
సర్వ పాంథులూ;
బాటలోనె ఉంటి గాని
వాటమైన నీడ లేని
దేటికి యీ జన్మ? ఒరుల
కేమి యిత్తునూ!"

సంస్కృతం - స్ఫుటశ్లోకం

## వ్యర్థ జన్మ

తప్పి పడిన పుట్టు
తగదు చూచుటకైన;

పండు కాయ లేని
మొండిమోడు —
పత్తి చెట్టు:
దాని వలె
పామరుడ నీది
పట్టి వేసడంపు
పుట్టు వోయి.

పాకృతం - గాథ

## సందేహం

ఒక రూపు పది తల—
లూని రావణుడు
మొకము సూపిన రోజు
ముదిత చింతించె,
ఏ ముఖమ్మున వీని
కే నివ్వ వలయు
నో మఱి పాలంచు
నొక్కింత తడవు.

హిందీ - సోమప్రభ సూరి

## గొప్పగుణం

ఎముక లేని చెయ్యి,
ఎల నవ్వు మొగమును,
చలువ జిలుకు మంచి
పలుకు తీరు,

వెన్న వోలు గుండె—
అన్న నీ నాలుగు
గుణము లున్నవాడె
గొప్పవాడు.

*

## మొలకు తీరు

మొలక తీరు జూచి
తెలుసు కొందురు మఱి
నేల మంచి చెడ్డ
పోలికలను;
పలుకు తీరు జూచి
కలిగిన వంశమ్ము
దెలుసు కొనుట
యిల్లె కలదు సుమ్మి.

తమిళం–తిరువళ్ళువర్

## వెన్నెల

జలజభవాండ మొప్పె
గలశంబు విధంబున;
నందులోన నుజ్వలమగు
చంద్రికాపటలి
సన్ను కేక్కె
బయః ప్రపూర్ణమై,

లలిత కళా కలాప
సదలంకృతి
చారు సుధా మరీచి,
యింపుల గనియై తనర్చె—
బయి బొంపిరి గట్టిన
మీగడో యనన్.

తెలుగు - అనంతుడు

## కొత్త అల్లుడు

సందు గొందులలోన
చంక బుడ్డీలతో
చక్కర్లు కొట్టేటి
చక్క నోడా
తలవంచుకొని సిగ్గు
పులకరిస్తుండగా
కొత్త అల్లుడు వోలె
కూర్చుంటివా?
గాలిపటములు గట్టి
గోలచేస్తూ యిళ్ళ
మిద్దెలను పరువెత్తి
మిడిసిపోయే వాడ!

తలవంచుకొని సిగ్గు
పులకరిస్తుండగా
కొత్త అల్లుడువోలె
కూర్చుంటివా?
పనికి పోయే వేళ
బాటపై 'ఆపాలు'
కొని పల్లెలో దాచు
కొంటెవాడా
తలవంచుకొని సిగ్గు
పులకరిస్తుండగా
కొత్త అల్లుడువోలె
కూర్చుంటివా?

తమిళం - పాతపాట

## మంచితనం

ఎచట మాటల కరుణ
చిప్పిల్లుచుండు;
ఎచట చూపులు పెరిమ
చిందించుచుండు;
అచటనే నీకు
మంచితనమ్ము దొరుకు
నంచు తిరువళ్ళువర్
వచియించినారు.

తమిళం - తిరువళ్ళువర్

## సూర్యుడు

వెలుగు పెంజాలున
వెడలిన రాయించ:
చదల గూర్చున్న
సంపదల రాజు;
వేదిక దాపున
వెలసిన హోత;
గేహమ్ము ప్రవేశించి
నట్టి యతిథి:
మానవమధ్య
సమ్మాన్య నివాసి:
ఉత్కృష్ట పద
ప్రాప్తిగన్నవాడు:
సత్య సంపూర్ణ
సంస్థాన నిత్య నివాసి:
గగనమ్మునం దాపు
గలుగు వాడు:
జలమునం దుద్భవించిన
మొలక పువ్వు:
పర్వతమ్మున జన్మించు
పసిడి పాప;
వెలుగు దీవిని బుట్టిన

వే వెలుంగు;
నిత్యా ఋత జాతు
డీ పద్మినీ ప్రియుండు.

వైదికం - యజుర్వేదం

ఆశంస

చెలువు మొగమ్మ దాకి
విరిసెన్ చిఱు సిగ్గులు;
నేన్గు తోలు వల్వల
ఋయి లోడె;
పాముల గలంగె;
నెలం గని పొంగె;
గంగ ముంగల నుడికెన్;
కపాల సముఖమ్మున
గాసిలె—
నూత్న సంగమా విల
గిరిజా విలోకనము—
వేమఱు మి మ్మది
బ్రోచు గావుతన్.

సంస్కృతం - కావ్యప్రకాశం

అభిసారిక

నీ ముఖ చంద్రిక
చీకటి దీమును
తొలగించు,

నేల తెలివా చన?
నీ ధామమున కేగు మిక —
పర భామలకును
విఘ్న మేల
పరికల్పింపన్?

ప్రాకృతం - గాథ

## మధురభావం

మరులు కొనుము
మనసా! ముర
హరుని మోహనున్;
మురిసి సామ్ము
మురళీధరు
దరిసె నమ్మతో,
సరసిజాక్షు
సరస జేరి
పరువు లెత్తుమూ;
ఉరమున గిరి
ధరుని దాల్చి
పొరలి పాడుమూ.

హిందీ - బిహారీలాల్

## సలహా

ఎట్టి పని యైన గాని
చే పట్టకుండ,

చేయఁ లేనని
వెనుకంజ వేయఁబోకుఁ:
కాని దన్నది లేదు.
నీ లోని చేవ
కష్ట పడుచున్న కొలది
కాకలను దీఱు.
మొదలిడి నడుమనె
పనులను వదలుట
తగ దెప్పుడు;
సగము వఱకే సేయున్
బదుగురు నగుదురు,
నిను నెమ్మది దలపరు
పట్టి చచ్చు
మానిసి వనుచున్

తమిళం - కురల్

చంద్రోదయం

అమరు లమృతాంబు
నిధిలోని అమృతరసము
వెండి చేరుల
బటికంపు గుండగట్టి
చేదుకొనియెదరో నాఁగ,
శీత రోచి
మెఱుఁగు మెయితోడ
యల్లన మిన్నుఁ బ్రాకె.

తెలుగు - తిమ్మన

## ప్రార్థన

మా కంటికి చూపునిమ్ము
మా వంటికి చూపు నిమ్ము
మా లోకం లోతు పాతు
మా మంచిగ చూడనిమ్ము.

వైదికం - ఋగ్వేదం

## అలుకగొని....

అనుక గొన్నప్పు
డల్లంత కన్బొమ ముడి
వెట్టుటే యొక గొప్ప
చెట్ట తనము;
కయ్యమ్మురా
నాల్క కదపక
యుండుటే
కన్పింప జేసెడి
కఱకుదనము;
ఊరట జెందిన
తీరు దెల్పుటయున్న
నవ్వు మొగ్గల
జల్లు నంతసరకె;
మనసు వెన్నెల గాయ
చనువుతో కనులెత్తి

నడచు తాల్మి లేమియున్,
హామ్మును-గల
మానిసి లోకమ్మున
జెడిపోవు సులువుగా
నెల్లపుడున్.

బండి నిండ, బరువు
దండిగా వేసిన
తరుణమందు
చూచి యెరుగవలయు;
నెమిలి యీక కూడ
నిండు బండికి పెద్ద
బరువై యగుట
యిరుసు విఱిగిపోవు.

తమిళం - కురళ్

## నా గా రు

అలికులవేణి యూరు-
నవ యౌవన మన్
వలరాచ తోటలో-
బొలుచు నితంబ వేదికడ,
బొక్కిలి డిగ్గియ చెంత,
నీల సంకలిత
పవాంబు యంత్రమగు;
గానిమెడన్

రస గుంభనంబు సంధిల.
బుట ముబ్బునే
నడుము నిల్చి
ఘన స్తనసూనగుచ్ఛముల్.

తెలుగు - భట్టుమూర్తి

ఈవి

అర్యమునకు గాని
ఆ ప్తులకే గాని
పెట్ట నట్టివాని
వెట్టి పంట,
ఆత్మ వధయె
సత్యమాడుచునుంటి—
నొంటరిగ తినెడు వాడు
పరమ పాపి.

వైదికం - ఋగ్వేదం

కర్మిష్ఠి

కర్మశీలి నెపుడు
కాంక్షించుదురు సురల్,
నిద్రపోతు నెపుడు
నెనరు పడరు;
మేలు కొన్న
దేవ మిత్రులు

పడుకొన్న వాని
శిక్ష సేయ
బూనుకొంద్రు.

వైదికం - ఋగ్వేదం

## అహంకారం

కైలాసమ్ము గదల్చితిన్,
స్వశిరముల్ ఖండించితిన్,
విష్ణుబందీ లా గుంచితి,
పుష్పకమ్ము గొనితిన్
నిర్జిద్ర బాహూత్కర శ్రీ
లోకేశుడ!—
ఇంక పాతవడి
ప్రచ్ఛిన్ బొమ్మ విల్లిద్ది—
నే లీలన్ వంచిన,
త్రుంచినా
కలుగు కీర్తి ఖ్యాతు
లేముండు లే!

సంస్కృతం - రాజశేఖరుడు

## అలత

ఎండ చేతను
వాడి పోయినది మొగము;
చిఱుత గాలుల

వెంట్రుకల్ చిక్కువడియె;
దారి నడచి శరీరమ్ము
డస్సిపోయె—
లోన రాకున్న మానె
విల్చుండవయ్య!

సంస్కృతం — అమృతానంద

## సూచన

తేరు జూడవచ్చె
నా రాము;
నీ భార్య యేమి
సెప్పినదియొ
ఏడ్చుచుండె
నెవరు లేని యింట—
నీ వైన ఓదార్చి రమ్మ!
పాప మబల సుమ్మ
మఱది!

ప్రాకృతం - గాథ

## నిగ్రహం

కరమున జపమాల
తిరుగునేగాని,
పరివర్తనము జెంద
దరసి యీ మనసు—

సరిజేసుకోరు మది
పారలిపోకుండ;
వర మార్గ మదియె - కా
దుర! జపమాల.

హిందీ - కబీర్

## చిత్రాగ్ని

రమణి దూరముగా నున్న
రగుల జేయు,
నెలత దగ్గఱగా నున్న
చలువ లీను;
నిప్పడతి చిత్రమైన యీ
నిప్పు నింత
కెపుడు మచ్చిక
చెసెనో యేమొ గాని!

తమిళం - కురళ్

## మేలుకో!

నిద్దుర మేలుకొమ్మ
రజనీ చర వంశ వతంస!
కుంకుమం బద్దిన భంగి
మింట నదె
యామిని చెల్లెలు
కాల్య సంధ్య రా

కాల్య సంధ్యా రా
నుద్దిలు సేయుచున్న యది
యుష్ణ మయూఖ సుత
ప్రసూతికిన్
బొద్దులు చొచ్చి
యున్న యవి
పూర్వ దిశా
సరసీరుహాక్షికిన్.

తెలుగు—శ్రీనాథుడు

## అగ్ని స్తుతి

జన దీపిక వోహో వహ్నీ!
జన ప్రియుండవహో అగ్నీ!
జనోత్తముడవు ప్రజా
సన్నిహితుడ
వెనయుందుము జీ
వనము నొసగి గా
యన కర్తను కేతూ!

వైదికం - ఋగ్వేదం

## కవి – కవిత

కవి సరసుడైనచో
మఱి కవితయు
రసవంతమగును;
కవి రసహీనుం

డవు నేని, నీరసమె యగు
కవిత సమస్తమ్ము
నెట్టి కావ్య మ్మందున్,
ప్రాణ హీనములు
ప్రాణవంతమగు,
ప్రాణవంతములు
ప్రాణహీనమగు
మానసీయ కా
వ్యాన, కవి స్వతం
త్రానతమై, యెది
యేని మార్పగును.

ఆలంకారికం - ధ్వన్యాలోకం

జత

నిదుర నటించు
చెల్వ్వగని, నెచ్చెలి
మోమున మోము జేర్చి
లేపెదనని భీతి
ముద్దు నిడు పేర్మి
గణించుకయుండె;
నాతడున్ —
సుదతి వెఱంగునన్
ముఖము జూపదటంచు
యతింపడయ్యె;

నిల్లిదల బెసంగు
కాచునలనే,
రతి పారము
జేగి దిద్దిఉన్,

సంస్కృతం—అమరుకం

## స త్య ం

స్వతేజః ప్రభూత మహిమా!
న్వితుల్ క్రిందుగా రెపిరికివ్?
వితాకై మృగేంద్రము, పలా
యితమాన్మనె! ఏనుగులతో.

సంస్కృతం—ముక్తకం

## సొ గ సు

శీల భారవతి సతి
సుమజాల భారవతి లత
భావాలయభర వాక్తతి
ఏదో లావణ్యమ్ము గూర్చు.

—పండితరాయలు

## పు న రు క్తి లే దు

ప్రేమికుల విభ్రమములకు
పెద్ద పెద్ద కవుల
వాక్యమ్ములకు గాని
అవధి యన్న మాటయే లేదు;

పునరుక్తమన్న
దోషమునకు గూడ
ప్రసక్తి యెందునను లేదు,

ప్రాకృతం - గాథ

## సాధు సేవ

సాధువుల సేవింప
సంతోష పడును హరి:
సాధు విముఖత గల్గ,
సర్వదా పొగడినా
సర్వేశు డెపుడు రో
షా యత్తుడగు సుమ్ము.

హిందీ - వ్యాసజీ

## బాధాగ్రహణం

మంచి మనసు గలుగు
మానిసి తనకు,
పృథ్వీశ పదవి
యబ్బు నెడను గూడ,
నొరుల గుండె గలచు
కరణి ప్రవర్తింప
జాలడన్న మాట
చాల నిజము.

పరుల మనసు
గాయపడిన

కంపించని
పోటు మనిషి
తెల్వి తేట లేల?
ఒరుల గుండె
నొప్పి నెఱిగిన వాడే.
ఎవ్వరి మనస్సు
నొప్పి వఱచకుండు.

తమిళం - కురళ్

## హారుడూ గిరిజా

సుడిగొన్న చిగురాకు
జొంపంబు కెంపారఁ,
దలమీఁద మల్లికా
దాము పుడచి:
నిడుద తామర తూఁడు
నెట్టెంబు జుట్టి పై,
బటికంపు గడియంపు
భాగ మదిమి:
తోన యాత్రేవ
గందొవ తేకు హత్తించి,
మెడ చక్కి కస్తూరి
మెదిచి పూసి,
పాయ గొమ్మల

నల్లపట్టు దగిల్చి,
యక్కొన యాకుపై
వెండి కోర వెట్టి;
ధవళ కేతక ధూళి
గాత్రమున దఱచి,
మోక మామిడి
కొక కొంత ప్రొక్కి నిలిచి,
యొడలిలో జక్కసగము
నా కొసగు మనుడు
నద్రి కన్యక తలవాంచె.
హారుడు నవ్వె.

తెలుగు - నాచనసోముడు

దోషం

కవి వ్యుత్పత్తి విహీనత
నవువఱచిన తప్పు
ప్రతిభ యగపడ నీ,
దా నవు! ప్రతిభ లేక
చేసిన దవు దోషము
బయటపడును
తత్క్షణమందే.

ఆలంకారికం - ధన్యాలోకం

## ఏంమనుషులు!

సేవింపగలరు రాజుల:
నా విషమును గూడ,
భోజనము సేయ గలా;
రింకా వెలదులతో నుందు;
రహో! వలతులు గద!
మనుష్యు లన్నిట గూడన్;

*

## చందమామ

తిమిరాంశుక మెల్లను
రాగముతో మును మున్నె
జార గనని రీతి
చంద్రముడు,
చలత్తారక — రాత్రి ముఖమ్ము
నుపోఢరాగ తీవ్రత
బొదివెన్.

*

## సంజ

సంధ్య అనురాగవతి,
దివస ప్రియుండు
గూడ వెనువెంటనే

దిరుగాడు చుండు:
కాని, వారి
సమాగమ కథయె లేదు:
అకట! విధి చైద
మేమని యనగవచ్చు?

*

## గుణము

సరసులు గ్రహియించిన
యవసరముననే
గుణములెల్ల
సద్గుణము లగున్:
సరసిజ బంధు
కరగ్రహా
వరముననే
పద్మములును
పద్మమ్ము లగున్.

సంస్కృతం - (ధ్వన్యాలోకంలో ఉదాహృతములే పైవన్నీ)

## సూచన

ఇచట మా యత్తె
శయనించు,
నిచట పండుకొందు నే:

పగలే చూచుకొమ్మన్నా నీవు
రేయి చీకటి బాటసారీ!
నిశీథి నా పడకపైన
బడెదవేమో పరాకు!

ప్రాకృతం - గాథ

## అడియేన్

పరమ సాధువుల
చరమ దాసులకు
చరమ దాసుడీ కబీరుడూ;
వర మహాత్మ్మ పా
ద రజః ప్రోత్థిత
తరుణ గ్రాసము కబీరుడూ.

హిందీ - కబీర్

## తమి

తమని దాచుకొన నెంతో
తమక పడుదునూ___
అమాంతమది బయల్పడును
సుమా! తుమ్ము లా.

*

## నీవు కూడా...

నన్నొక్కమాట
అడుగక మున్నే నా మనసు!
వాని మోసల జనదే!

కన్నా ఇక్కట్టులలో
నిన్నెవ్వరు చూడ రన్న
నీతి ఫలితమా?

తమిళం - కురళ్

## పారమ్య పరీక్ష

సరి! మాటలలో నందఱు

పరమ పురుషులే!

మరి! బంగరు, లేమ, కత్తి

యొరయని లుతురా?

కన్నడం - సర్వజ్ఞ

## చూపులు

కలయం గూర్మి
జెమర్చు నంగముల
లగ్నంబైన సన్నంపు
మంజుల కౌశేయమందు
మించు కమల
స్తోమంబుచే జూచె
నొక్క లతా తన్వి
చెలంగి, పొంగు
మది కాంక్షల్ దీర
మేనెల్ల గన్నులు గావించి

కుమారు జవ్వనము
చెన్నుం జూచు
చందంబునన్.

తెలుగు - పెద్దన

## మంచము

మొలక మెఱుంగు
కెంపు మొనముక్కుల నిక్కు
కిరీటి పచ్చడా చిలుకల
కోళ్ళలో,
చికిలి చంద్రిక వన్నియ
పట్టు పట్టితో,
దోలకు పసిండి
వ్రాత తెరలో,
నెఱి తావుల మేలు కట్టులో
జలువలు చిందు
ముత్తియపు జస్వర
మంచముపై మహోన్నతిన్.

తెలుగు - భట్టుమూర్తి

## ఉషస్సు

వలపుగొన్న మెలతలు తమ
చెలువుని సేవించునట్లు,
లలితాంగుళు లెల్లను పిడి
కిలి బట్టి మథించుచుండె;

మొలక నిప్పు నాల్కల రం
గుల మిలమిల లాడుచుండె:
వెలుగులతో ఉషసులు మిల
మిలల నీను తెఱగు దోప!

వైదికం - ఋగ్వేదం

## తీపి-చేదు

స్వాదు కావ్యరస
సమ్మిళితమ్మై
పాదుకొన్న వాక్
పంక్తి గ్రహింతురు;
మీది తేనెతో
మ్రింగ గల్గుదురు,
చేదుమందు నా
మీదనందఱును.

ఆలంకారికం-భామహుడు

## సమర్థులు

నేల తల్లి
బంగారపు
పూల గోయ
గల వలతులు
నేలమీద
ముగ్గు రనుట

నిత్య సత్యమూ
చాలిన పం
డితు డొక్కడు,
మేలి మగడు
మరియొక్కడు,
ఏలిక సే
విరచువాడు
నింక నొక్కడూ.

సంస్కృతం - ముక్తకం

కలుసుకొను టెన్న డన్నట్టు
చెలువు డంత
తన్ను జూచిన,
నాతని తలపు నెఱిగి,
చెలియ నెఱజాణ
కనుగీటి, చేతిలోని
తళుకు తామర పూవు
రేకులను మూసె

సంస్కృతం- ముక్తకం

పోవు ద మ ని....
ప్రబ్బ పొదనుండి
లేచిన పక్షి కులము
సేయు కోలాహలము
తన చెవిని సోక, ఇంటి పనులలో

ముగ్గిపోయిన నెలంత
అంగకమ్ములు
నిలువ నీ నట్టులయ్యె.

ప్రాకృతం - గాథ

భక్తుని మొఱ

ఇల్లాలి విడనాడి,
పిల్లల వీడి,
చల్లగా నీ వెంట
చనుచుంటి నయ్యా:
నీ భక్తి కరవాల
నిశితాసిధార
నీ భవబంధమ్ము
లెడ సేసుకొంటి;
ఇంద్రియమ్ములు వెల
యించిన వల న
నతంద్రుడనై
దాటి తప్పించుకొంటి,
శరణాగతుండనై
పరిరక్ష బొంది,
కరము సంసార దుః
ఖ శ్వాన పంక్తి
దరిదాపులకు రాని
తావున నుంటి.

తమిళం - తిరుమంగై మన్నర్

## చదురు లేనివారు

మది సుఖము గోరి
దుఃఖం బొందవంగల
కార్యములకు
నుత్సాహము సేయుదు,
రొప్పని తృష్ణంబడి
చదు రేమియు లేని యట్టి
జను లాతురులై.

తెలుగు - తిక్కన

## ప్రార్థన!

మమ్ము చూడు
వాస్తోష్పతి!
మాకు దాపు
సమకూర్చుము;
మా కోర్కెల
చేకూర్చుము;
మా మనుషుల
పశువులనూ
మా మంచిగ
కాపాడుము.

వైదికం - ఋగ్వేదం

## దైవస్వరూపుడు

మనసులోని కా
మనలను ఛేదిం
చిన మొనగాడే—
తనను దైవ రూ
పునిగ మార్చు గొ
ప్పను సాధించునూ.

పౌరాణికం-భాగవతం

## దివ్వె వెలుగు

వెలుగు వలయు నతడు
వెదకును దివ్వెకై;
ధ్వనిని గోరు కవియు
వాచ్యమైన
యర్థమందు మనసు
నంతట లగియించు—
దివ్వెలేక వెల్గు
దెచ్చు టెట్లు.

అలంకారికం-ఆనందవర్ధనుడు

## కన్నీరు

అనవరత
నయన జల లవ
నిపాత పరాస్త

పత్ర విలిఖితమై,
హస్త నిహితమగు
నీ ముఖ,
మెవ్వని మనసు
గలంచకుండు
వారిజనేత్రా!

సంస్కృతం — ధ్వన్యాలోకం

ధనికులు

రమ్మని—పొమ్మని,
పడు—లేలెమ్మని
పల్కుమని—
మాటలిక చాలంచున్,
దిమ్మ తిరిగింతు
రర్థుల బొమ్మలుగా
జేసి యాడి
భువి ధనవంతుల్.

సంస్కృతం- స్ఫుటశ్లోకం

కామము

కామమూలకముగ
గలుగు నా వేదన,
కామమూలముననె
గలుగు భయము;

కామమును జయింపగా
గల్గుదువయేని—
ఖేద మేది?
భీతి యేది యింక?

పాళీ - ధమ్మపదం

ప్రతిన!

అడవిలో నాకు లున్నట్టి
యవనిజమ్మునై
జనింతునుగాని—
యేమైన గూడ,
దానశీలత గల్గియు,
ధనము లేని
మనిషినై లోకమున
బుట్ట మనసు పడను.

ప్రాకృతం-ముక్తకం

కామిని

కుండలములు చెక్కులపై
కులుకులాడుచున్నవి:
కొల్లలు వెల్గుల మొగ్గలు
కుమ్మలాడుచున్నవి.
కన్నుల మిన్నుల లోపల
కాంతు లుబుకుచున్నవి,
కామిని మోమున చంద్రుని
కళలు దేలుచున్నవి.

హిందీ - నాగర్‌దాస్

## ఇరువాగులా....

ఇట్లు నట్లు
నొక్కటే బరువున్న
కావడిని మోయ సులువు;
వలపునట్లు—
ఒక్క వేపె యున్న
చిక్కని వలపు
భారమున నిన్ను
కాల రాచివేయు

*

## ఆమె ఆవేదన

తుమ్మువచ్చునట్లు తోచి
రవంతలో
నిట్టె యాగిపోయె
నేమొ గాని;
అతను నం దలంప
నాశించి అంతలో,
మఱచిపోయె నేమొ
మచ్చెకంటి.

తమిళం - తిరువళ్ళువర్

## వర్షర్తువు

గత సంతాపము,
శీతలీ కృత మహీ
కాంతాంగ,
మత్యుద్గత స్మిత
కుందోత్కర
కేతకీ కుటజ
రాజి భ్రాజితామోద,
మూర్జితవల్లి ప్రకరంబు,
వర్ధిత శిఖి శ్రేణీ
ప్రమోదంబు—
రమ్యతరంబై
కుతలంబు నాబరగె
వర్షారంభ మత్యున్నతిన్.

*

చలి గాడ్పుల ముసరుల
మెయి వలిగొని,
ధాత్రీ పురంధ్రి
వలిబచ్చని కంబళి
గవిచికొన్న విధమున—

నొాలువుగ
జిప్పరువు గలిసె
భూతల మెల్లన్.

తెలుగు - నన్నెచోడుడు

అం తే!

వికటమునసనుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నదరి కాకులు బెట్టు పెద్దఱచు నపుడు,
ఉడిగి రాయంచ యూరకయుంట లెస్స;
సైప రాకున్న నెందేని జనుట యొప్పు.

— సుందరపాండ్య, నీతిషష్టిక - 113. శ్రీనాథుని అనువాదం

దు రు సు మా ట

ద్వేషికంటె, బాణ
తీక్ష్ణతకంటెను,
అగ్నికంటె, విషము
నంతకంటె,
వ్యాధికంటె మిగుల
పరుషవాక్యమ్ములు
గుండె కోసి కోసి
కుములజేయు.

సంస్కృతం - సుందరపాండ్య

పూ షా !

అంబోధి మధ్యముల
నంతరిక్షమ్ములో
నయ్యా! నీ స్వర్ణ నౌ
కానీకములు తిరుగు.
అతివైభ వేచ్ఛతో
ననురాగ వాంఛతో
నర్యముని కడకు పూ
షా! వెడలుచుండెదవు.

వైదికం - ఋగ్వేదం

ము ఖ ం

చిఱు సిగ్గు లుఱులు చుండియు,
నెఱి ముగుదతనమ్ము
మివుల నెనసియు,
కళలన్ నెఱతనము
జాణతన
మ త్తఱి తరుణి వెలార్చి
గురుత దా నాచుకొనెన్.

లౌకికం - ధనికుడు

శీ త లా గ్ని

జలజ నాళ హ స్తమ్ములు
లలితపు రంభోరువులను
కలువ కనులు కలిగియు నీ

ఎలరూపము మమ్మేల ని
ట్లలయించుచు నున్న దెట్లు
చలదలికుంతల లలనా?

## జీవితం చంచలం

సంస్కృతం - దండి

ముదితలు సుందరులే;
సంపద లెల్లను
రమ్యమైన వనుట నిజమ్మే;
అది కాదు — జీవితమ్మే
మదిరాక్షి కటాక్ష లవ
సమాన చలవమ్మే.

## తథాగతుడు

సంస్కృతం - ధనికుడు

పేదసాదల పెరిమతో
నాదుకొనుట;
గాయపడినట్టి వారిని
కాచియుంట;
ముసలి ముతకల,
దిక్కును దెసయు లేని
వారి జూచుట —
ఇందుకే వచ్చె నతడు.
ఈ పనుల జేసి యితరుల
హెచ్చరించి, వారితో గూడ

చేయించి, వన్నెకెక్కె—
నా తథాగతు—
దందులోనే తరించె;
పంచనదులు సముద్రమ్ము
బడితరించు.

పాళీ - ధమ్మపదం

## డోలాయమానత

ఇటు లేమో చెలి యేడుపు—
అటు లేమో సమరభేరి
యాహ్వానంబున్—
భటు మనసు
ప్రేమ రసమున,
పటు రణ రసమునను
డోలవలె కొట్టుకొనెన్

ప్రాకృతం — ముక్తకం

## జలధికుటుంబం

కూతురు లచ్చిమి,
హరి జామాత,
గృహిణి గంగ,
చందమామ - సుధయు నే
మో తన గుట్టలు; జలనిధి
పూతకుటుంబ మ్మదెంత
పుణ్యవంతమో

- ముక్తకం

## ప్రేమమాలికలు

ప్రేమరాణి రాధాసతి
ప్రేమరాజు మాధవపతి
ప్రేమవాటి విహరించే
ప్రేమ మాలికలు నిద్దఱు.

హిందీ — రసఖాని

## మెత్తని మనసు

మనసు మెత్తవఱచు
ననురాగ రసము;
నేస్తమ్ము గూర్చిపెట్టు
తలిరు టెడద;
ప్రేమ పూర్ణహృదయ
సీమను పండని
ఫలము లేదు;
గొప్ప వరము లేదు.

*

## విరహంలో....

దీపమూగ్చ్బె దనుక
నోపిక చీకటి
కాచివేచియున్న
కరణి వదిగో

నా మనోహరుండు
న న్వేడి చనుదాక
కాచి బయట వడియె
కాయజుండు.

*

చూచితిరా?

చిక్కుచుంటి వేమే అని
చేతులు బాడుతురె కానీ,
వెళ్ళిపోతివేరా యని
వెలదు లడుగరే వానిని?

తమిళం — కురళ్

కడకదే!

తలముచ్చుట్టులు దిరిగిన
దలపోయగ
నోటిలోని దయ కడియన్న
ట్లిలనే తిరుగులు
తిరిగిన, గలుగదు గతి
విష్ణుసేవ గావించకయున్.

తెలుగు — తెనాలి రామలింగడు

చందమామ

సురచిర పానపాత్రమున
సుందరి యొక్కతె
కేళ నింపుచందురుడు

ప్రకంపితాంగకముతో
దిలకించె,
పదాసనాంబుజ
స్ఫురితవికాస
వైభవము సొంపు
లడంకువ ప్రముచ్చిలింప,
జెచ్చెర జనుదెంచె
పట్టువడి, చేడ్పడి
భీతి వడంకు చాడ్పునన్.

తెలుగు—ఎఱ్ఱాప్రెగడ

వేకువ

కన్నతల్లి కై సేసిన
కన్నెవోలె వెలిగిపోవు
అన్నుల మిన్నా! వేకువ
చిన్నెలాడి! మా కన్నుల
వెన్నల విరియింతువే
పున్నమన్న నీదే! ఓ
కన్నా! మిన్నుల దాకుము!
ఎన్ని వేకువలే అయిన
నిన్ను బోలగల వేమిటి?

వైదికం—ఋగ్వేదం

## దయాశీలి

ఉల్లమునందు తం దలచు
నొజ్జల కెయ్యవి గోరుకున్న,
నే యల్లరి లేక యిచ్చు
పరమాత్ము డనంతుడు:
గర్జలన్ చెవ్రల్
చిల్లులు వోవ జేయకయె,
చిక్కని మబ్బులు
కుంభ వృష్టులన్
చల్లగ జేసి పేయును,
విశాల మహీతలి
నొక్క యూపునన్.

పౌరాణికం — భాగవతం

## కవిత్వసామ్యం

సహజ శక్తి, నేర్పు,
సహజ పాండిత్యమ్ము,
కావ్యపరిచయమ్ము,
కవుల శిక్ష,
లోక పర్యవేక్ష—
చేకూర జేయును
కవిత వ్రాయ గలుగు
కడిది నెపుడు.

ఆలంకారికం - కావ్యప్రకాశం

## దాచలేవు!

కౌగిలింప జూచు కాంతుని
చేతుల ద్రోసివేతు,
వెందుకోస మబల!
ముమ్మరముగ మొలుచు
పులకలే నీ కోర్కె
వెలువరించు
తొట్రు తొలుత నుండి.

సంస్కృతం - ముక్తకం

## బాల్యయౌవనసంధీ

మిసిమి తొలకె కనుల,
పసి తగ్గె నాటల;
పలుకు సొదల చెవులు వాలె,
తొలుత వోలె యొడిని
గూరుచో లేదు; బాల-
జవ్వనము, పసితనమ్ము
పెనగులాడ.

—అమృతానంద

## ఖలుడు

చెలిమికైన,
వైరములకైన నొక్కటే—
ఖలుడు మనకు

తరము గానివాడె!
కుక్క పొత్తు మనకు
కూడనిదే —
మూతి నాకుచున్న,
కండ పీకుచున్న.

—సుభాషితత్రిశతి

నె ఱ జా ణ

కలికి కచ్చువడిన పెదవి
తిలకించిన కోప మేల
కలుగ కుండు నెవరికైన
చిలుకల కొలికీ!
వలద టన్న వినక వాస
నల చూరొ్కంటివి, తుమ్మెద
గల పద్మము, ననుభవింపు
లలన యిప్పుడూ!

ప్రాకృతం - ము కకం (ధ్వన్యాలోకం)

మ ం ద మా రు తం

రణ ద్భ్రమర
ఘంటా రవమై
ఝుర ద్దాన
ధా రాసనమై
కుంజరమ్ము

కుంజ సమీరం
వచ్చె మంద
మంద గభీరం.

హిందీ - బిహారీలాల్

## ఆ వే ద న

కోలకుల వానల
జలముల నిండె
కలికి రాజల చూచి
విలపించు చుండె
"అక్కట నన్నిట్టు
లొక్కతె సేసి
ఎక్కడి కేగనే
ఇటు నను రోసి?"
అప్పుడు చెలికత్తె
అనసాగె నిట్లు
"తప్పు మానిసి యయ్యె
తన్వి యిం కెట్లు?
వేసిన చెట్టునే
వ్రేల్చనే యిట్లు?
ఈసున గిరినుంచి
త్రోసెనే యెట్లు?"
రమణి మాటను విని
రాజల దేవి

కమలి యిట్లనసాగె
కమలాల బావి.
"నిజము చెప్పితి నమ్మ
గజరాజ గమన
వ్రజ బాలు డిటుసేసె
వర చంద్ర వదన"
సరసులు తెగియె వ
ర్షా ప్రపాతమున;
సరిదధీశుడు క్షోభ
పడెను వాతమున;
గిరులెల్ల జల జల
కరగుచు నుండె,—
కరగదే నా సామి
కటిక ఆ గుండె.

గుజరాతీ - నేమినాథ చతుష్పదిక

## గృ హి ణీ ధ ర్మ ం

మగని గడన మించి
నగదు వెచ్చించని
మగువ తగిన భార్య
యగును సుమ్మ;

నగవు తోఁడ మగని
నవ్వించ వలె గాని,
అగడు వెట్టి వాని
తెగడ రాదు.

తమిళం - కురల్

పొదలు

విరహి జనమ్ములన్
మరుడు, వీపుల
డాగులు వేయబూని
నిష్కరుణ,
నిజ ప్రతాప శిఖ గ్రాచగ
గ్రాగు శలాకలో యనన్,
ధరపయి నెల్లెడెన్
దరుల దట్టములై
చిగురాకు జొంపముల్,
నిరుపమ లీల బొల్చె
దరుణీ! కనుగొంటె
మిటారి చూపులన్.

*

చిగుళ్లు

తలిరుం గైదువు రాయ,
దధ్వగులపై దండెత్త
లేగాలి బెత్తలచే

బంపిన పండుటాకు తగటీ
జాబుల్ కనుంగొంచు,
వింతలుగా వారికి
జైత్రుడిచ్చు బురుసా దట్టీలు,
ముత్యాల తావలముం బోలె
దగుం జిగుళ్ళు,
గలికా వారమ్ము
తీరమ్మునన్.

తెలుగు - చంద్రభాను చరిత్ర

## వాయుదేవుడు

మలిన విహీనము వేకువ
బలు బల్లున విచ్చును, ఏ
వలి దేవర! నీకోసం
మిలమిల వెలుగుల కమ్మల
పలు వెన్నెల వలువ బఱచి
తళతళ లాడుచు నున్నది:
కల కోరిక లెల్ల దూర్చు
వెలి వేలుపు టావు తల్లి
కలుముల గురియుచునున్నది:
పిలపిల ఆకాశ గర్భ
ముల జీల్చుక మొలిచివచ్చు
చలువ గాలి దేవర! మ
మ్మల నెప్పుడు గాపాడుము.

వైదికం - ఋగ్వేదం

## అతడు

ఎవని లోన
లోకమెల్లను నిహితమ్మై
యెనగు కోశమందు
నిమిడి నట్లు:
ఎవనిలోన జగము
లిట్టివి భాసించు
జాలమందు
పక్షిచాలు వోలె.

పౌరాణికం - వ్యాసుడు

## ప్రతిభా, వివేకం

ప్రతిభ, విచక్షణ లేకే
యితరుల భావముల
ననుసరింతురు,
కవితామృతరుచి
దెలియుట కన్నన్
ప్రతిభ విచక్షణ
సతమ్ము ప్రాముఖ్యములౌ.

ఆలంకారికం - సోమదేవసూరి

## చు క్క

చిక్కగ పెరిగిన చెట్లదారిలో
నక్కిన చీకటి
నవల ద్రోయుచును,
చక్కెర విలుతుని
సాయం యాత్రకు
నిక్కిన దివిటీ
బిలువు వెల్లువలె
చక్కని చుక్క
లసద్గతి, నుర్వర
కొక్క యలంకృతి
గూర్చుచు నడచెను.

లౌకికం - అలంకారసంగ్రహం

## వ ల కా క

వెన్నెల వెల్లువల్
తడిపి వేయ
వలంతులు కాకపోయె;
అన్నన్న! సుగంధ శీతల
హిమాంబువులున్
కదిలించలేక పోయె___
న్నవలా యిదేటి
యలయింపుల వేడిమి తల్లి?

ఔనులే!
కన్నె గలంచునట్టి
వల కాకయె సుమ్మిది
తేటతెల్లమే

సంస్కృతం — దండి

## వలపు

తలపు దవిలినంత,
తన కంట బడినంత,
మత్తు గొలిపి
తన్ను మఱవజేయు
గొప్పదనము-
మదిర కెప్పుడు
చేకూర;
దొక్క వలపు నందె
యొదిగి యుండు

తమిళం - తిరువళ్ళువర్

## సాలవృక్షం

పురకాంతల
కౌనులకున్
సరిపడదని బ్రహ్మ
యాకసము నారసి వేరపరి,
దాని గుండలించిన

సరణిన్ దివిముట్టి
యుచటి
సాలం బలరున్

తెలుగు - చంద్రాంగద చరిత్రము

## దుర్గాస్తుతి

అగ్నిహోత్ర కాంతిమతీ
అకలంక జ్వాలావతి
అగాధాపగా తరణీ
అఖిల కార్యచరణీ
అమ్మాణ్ణీ! దుర్గా! సా
ష్టాంగ నమస్కార మిదే.

వైదికం - తైత్తిరీయ ఆరణ్యకం

## సర్వాంతర్యామి

నిప్పులోన నీటిలోన
నిఖిలలోక నియతిలోన
నికుంజాల లతలలోన
నిత్య పాదపములలోన
నిండి ఉన్న దైవానికి
నివేదింతు వందనమ్ము.

— శ్వేతాశ్వతరం

## రాముడు

కనికరము,
బాధితుల ననుకంప,
శ్రుతము, సచ్చరిత్రము,
దమమును, శమము
ననెడు నారు గుణములు
కొల్లలుగా రహించు—
పురుష సింహుడు
రామ భూవరునియందు.
ధర్మ రూపుడు,
దివ్య తేజోర్మియుతుడు
భువన భూజపు మూలమై
బొలుచు నతడు;
కొమ్మ, లాకులు, పూవులు,
కోటి కాయలై
వెలుంగుదు
రా చెట్టునందు జనులు.

పౌరాణికం - వాల్మీకి

## మెప్పు

కవితా మధురిమ
తెలియగ కవులే
కావలయు నేమి?
కర్మ భోజన

మ్మెవరైనా తిని.
రుచి జెప్ప వలంతులె—
వంటరాని వారేయైనన్,

రసికు లెంత మెచ్చి
పస సేయ — నంతగా
కవిత మేల్మి
విలువ మిపుల హెచ్చు:
రసికు లెంత మెచ్చి
పస సేయ - నంతగా
మెలత మేల్మి, విలువ
మిపుల హెచ్చు.

ఆలంకారికం - సోమదేవ సూరి

తాలిమి లేక

చెలువుని పొందియున్
మురుపు జిక్క—
సరాగములాడ నేర్చు
కోమలి సుకృతాత్మురా
లగు సుమీ?
మఱి నా దురదృష్టమే మనన్
చెలియ! రవంత
సోక ముడి చెంతకు
చెల్వుని చేయి చేరనే—

చెలులను దిట్టుదున్;
మనసు చీకటియై
మఱతున్ సమస్తమున్.

లౌకికం - విజ్జిక

## అభిసారిక

నును సిగ్గు దొంతరల
బెనచి యొటకను వెట్టి,
గొనబు కన్నుల, తూర్పు
కనుమ కంకిత మిచ్చి,
మునిమాపు చీకటుల
మునుగు బెదరు నదల్చి,
తనతోడు లేని శం
కను దూరముగ డుల్చి,
ఎనలేని వేగమున
జన, బాదముల బూన్చి,
మొనసి గాజులు మ్రోయ
తనవారి దిగ ద్రోలి,
తన చెల్మి కాడెంత
చెనటి యైనను మఱచి—

చనుదు రభిసారికలు
తనివి దీరని తమిని.

—అమృతానందయోగి

## నెలయెక్కెనే!

ఏ సురసుందరాంగియొ,
జయించిన దేమొ,
మనోజ్ఞ వల్లకీ న్యాస
సుధా స్రవంతుల
ననంగ సమానుని;
వార లిద్ద
ఱే ధ్యాసయు లేక,
రేయి జతయై
గమియించిరో యేమొ?
కానిచో నో సుమగాత్రి!
యింతవఱ కుండునె!
కాంతుడు, గడ్డి పూలలో
మోసుల నెత్తు వెన్నెలల
మునోక్కని చంద్రుడు
నెత్తి కెక్కెనే!

-అలంకార సంగ్రాహం

## నేర్పు

తలిరు కంటె వలపు
లలితమై చెన్నొందు,
వలపు కాడు దాని
దెలియు వలయు;

సున్నితముగ మెలగి
సౌక్యం, చౌక్యంచుట
నేర్వవలసి నట్టి
నేర్పు సుమ్ము.

తమిళం - తిరువళ్ళువర్

## వహ్ని

వస్త్ర హీనులకును
వస్త్రమ్ము లిచ్చును,
రోగు లైనవారి
రుజల మాన్పు.
అంధునకును చూపు
నందించు నీ యగ్ని,
కుంటివాని నడక
కుదురు పఱచు

వైదికం - ఋగ్వేదం

## కైత

పులకరించును రేయి
చలువ వెన్నెలల;
జలదరించు సరస్సు
కలికి తామరల;
అలరించు లే దీవె
తలిరాకు నవల;

తొలకించును శరత్తు
తెలి యంచగముల;
వలపించు కవిత మి
క్కిలి విమర్శనల.

ఆలంకారికం - ఆనందవర్ధనుడు

## రస సిద్ధి

ఇచ్ఛ, జవసత్త్వములు,
లక్ష్య—మిట్టివానికొలది
చేకురు భాగ్యమ్ము;
పలుకుబడియు,
రీతియును—చక్కగా
సంతరించుకొన్న కొలది,
రస సిద్ధ కవితలో
గలుగుచుండు.

-ప్రవణసేన

## రామకథ

చనియెను తండ్రియాన
శిరసా వహించి
వనమ్ము రాము;
డాయనపయి భక్తితో
భరతు, డమ్మను—
రాజ్యము నెల్లవీడె;
చెంతన జని యా

విభీషణుడు,
తత్కపి రాజును
రాజ్యమేలి;
రింకను పొగరెక్కినట్టి
దశకంధరవర్గము
నేల పాలయెన్.

లౌకికం - మహానాటకం

## చిలుకపలుకులు

చిలుకను
గొంతుక నిడుకొని,
పలికింతువ యేమి
ముద్దు పల్కుల?
దానిన్ బులిపింప
నెంచియే గావలయును
మరు డుంచె
దొండపండు పెదవిపై.

-మూక కవి

## లోకం

సురల కమృత మిచ్చె,
పరమేశ్వరున కేమొ
సాడు విసము నిచ్చె
పాల వెల్లి;

భాగ్యవంతు లన్న
పడి చచ్చు లోకము;
గొప్పవారి జూచి
గుల్లు మనును.

ఉత్ప్రేక్షా వల్లభుడు

## తియ్యమామిడి

అంద చందాల
కౌముది నాహరించు
కైరవము వోలె,
నీ సహకార మిపుడు,
మధుర సౌరభమ్ములతోనె
మధుప పంక్తి నెల్ల
నాకర్షణము సేయ
నియ్యకొనును.

-అమృతానంద

## గ డు సు వా డు

చెలువుని పెదవి—
మరొక్కతె పలుగాటును
చూచి పడతి,
పద్మముతో నిచ్చలు గొట్టె;
కంట కేసరములు
పడినటు లతడు

కనులమూసె నంతటన్.
లలన తటాలున డగ్గఱి,
నలుసున్ బోనూదుచుండ,
నా వగకాడున్-
చెలి చుంబించెను—
తెలిసీ తెలియని యటు
గడుసుదనము
తెకతెక పెట్టన్.

సంస్కృతం-అమరుకం

## కోతలు

మాటలరాయని
  బీరము లెల్లను
బీటువోవు కద
  నమ్మ తాగనే;
దీటులేని స
  ద్వంశ గౌరవము
కాటువడును, చెడు
  కొడుకు గల్గనే;
చుట్టపు మక్కువ
  లెల్ల చేడ్పడును,
గట్టిగ వారిని
  గమనించగనే.

చదువు సాము లవి
    చదునై పోవును,
గది విలాసములు
    కుదురుకోగనే;
వాగుడు కాయల
    పోడుము లెల్లను
మూగవోవు, పం
    డితులు రాగనే;
కట్టుబాటు లవి
    కకవికలై చను
చెట్ట వ్యసనములు
    చేరి రాగనే;
రొక్కమెల్ల నా
    శనమై పోవును
రోవెలంది ప
    య్యెద సోకగనే.

-జ్వాలాముఖుడు

## సత్యమనగా

ఇసుమంత యేని
మనసున కసుమాలము లేక
పలుకోగా-సత్యమగున్;

మసిలేని మంచి గూర్చిన
యసత్యమును గూడ
సత్యమై యెసలారున్.

*

## వేషము కాదు...

చక్కనిదైన శరమ్మే
ముక్కిడి - రక్తమ్ము ద్రావు;
మఱి వక్రమ్మే
నిక్కము—వేణువు, కాని
చిక్కని గుండియల
నగవు సిరు లొలికించున్.

అక్కతన పై మెఱుంగుల
గ్రక్కున గని,
మంచి చెడ్డ
గ్రహియించుకుమీ!
ఒక్కొకరి చేత ముఖ్యము,
ముక్కు మొగము గాదు—
నమ్మవోయి నేస్తమా,
లోక నింద్యమైన
కాకృత్యముల జోలి
పోకయున్న జాలు -
పుడమి నరుడు;
పెద్ద పెద్ద జడల

పెంచగా పనిలేదు.
గుండు చేసుకొనెడు
గొడవలేదు.

తమిళం - తిరువళ్ళువర్

## పెం పు

విందులు విందు లంచు దను
వేడుక నెత్తుకొనంగ బిల్వా,
నింపొందగ నేగి పై బడుచు,
నుబ్బున గేరుచు
చెంగలించుచున్,
సందిలి పట్టియాడు
మన నాట్యము లాడుచు.
ముద్దులన్ మహానంద మొనర్చె
బాలిక దినంబును
జుట్టపు బూవు బోండ్లకున్.

తెలుగు - పింగళి మాదన

## త ప్పు గ దా!

ఇటు తగునయ్యా!
విప్రుడ, వహీన గుణాఢ్యుడ వీవు,
నీకు నేమిటికిటువంటి దౌష్ట్యము
శమించునె మజ్జనకుండు విన్న?
దక్కటి జను లేమి యంద్రు?

మది గాంక్షయె గల్గిన,
నగ్ని సాక్షిగా
జిటికెనపట్టి కాక,
వృథ సేయుట ధర్మమె—
కన్యకాత్వమున్.

తెలుగు—అనంతుడు

## అసాధ్యం

జా నెటులో నఖక్షతము
లా వలెవాటున దాచనేర్తు,
వానా నధరమ్ము మూసుకొని
యూ రదనక్షతి దాచ నేర్తు.
పైనా—
నవలా సమాగమ
సునారతమున్
దెసలన్ వెలార్చి,
పైపైన జరించు
సౌరభము
పట్టుక దాచుట
నీకు శక్యమా!



సంస్కృతం—మాఘకవి

## అయినా....

"చాలు చాలు చాపల్యం
స్వప్న మాయతో తుల్యం
సరసిజాక్షి సాంగత్యం
విరసించును తుది తథ్యం"
అన్న మాటనే నిత్యం
అనుకుంటా నిది సత్యం;
అయినా మరి నా చిత్తం
అటే వెళ్ళునే మొత్తం!

—బిల్హణకవి

## కోప ప్రకటన

ఎదురేగు నెపమున
నెంతో దూరము వచ్చి,
ఏకాసన స్థితి
నేమరించె;
తములమ్ము దెచ్చు
వ్యాజమున లోనికి వెళ్ళి,
తటుకున
కౌగలించుటను మాన్చె;
చెలికత్తెలను
కార్యముల బురికొల్పు
సాకున, పల్కరించు

చిక్కను సడల్చి:
వచ్చిన వాని
సేవనలో నిమగ్నయై
సరణినే పనుపెల్ల
సాగనిచ్చి:
నిట్టు తన చెలికానిపై
గట్టు తెగిన
కోపమమంతయు కపిదీర,
కొసరి కొసరి
ఒలక బోసెను—
వలపుల ములికి, కలికి
ననలు మొలిచిన
నెఱ జాణతనము లొలుక.

—అమరుకం

బుద్ధుడు

జిజ్ఞాస యెల్ల వేళల
ప్రజ్ఞానము బెంప,
తలను వంచుక నడిచే
ప్రజ్ఞా వంతుడు,
ధర్మావజ్ఞను
సహించ నట్టి వాడు
బుద్ధుడో.

మాటల మూటల చాటున
పోటీ పడువాడు కాదు—
బుద్ధి స్థిరతన్
మోటుకొని ధర్మ నిరతిని
పాటించెడు వాడె-
బుద్ధి పరిణితి నందున్.
ప్రాయము పోయిన యంతనె
ఆయన నందఱును
పెద్ద యనగల్గుదురా?
కాయము పండిన,
సత్య మ్మాయము దప్పినను
తెలివి యది బలపడునా!

పాళీ—ధమ్మపదం

## సంధ్యా విశేషాలు

అయ్యో సాయంతనమ:
నిన్ను కుయ్యి పెట్టి
పిలిచినా రెవ్వరే
బొట్టుపెట్టి యిటకు?
ఆలు మగలను
వలవంత పాలుసేసి,
నలిచి వేతువు గద
నిన్ను పిలుతు రెవరు?

దిగులువడి వెలవెలవోయి
సగము చిక్కి శల్యమైతివి–
ఏలమ్మ సంజ తల్లి!
నా మనోహరు వలెనె
నీ నాయకుండు గూడ
కనికరమే
లేనివాడ ఏమి?
చెలువుడు లేనప్పుడు,
సంజలు వచ్చున్ పైన పైన
సంబరమ్ముతో:
కలికీ! కుతుక నలుకగ
తలవరి ఏతెంచు తీరు
తలపున దోపన్.
ఏమిటో గాని నా నాథు
డింట నున్న
యంతవఱకును
దెలియ దావంతయైన;
అవును మాపటివేళ–
అన్నన్న! యెంత
చుఱుకు గలదమ్మ!
నేటికి యెఱుకవచ్చె,
వేకువకు నేను చేసిన
సౌకర్య మ్మేమి?

యింక సంజకు నేనై
చేకూర్చిన చెడుగేమిటి?
ఈ కలి యేమందు! నన్ను
నిటు లేడ్పించున్.

తమిళం—కురళ్

# అప్పుడు

ధరణీ చక్రము
దద్దిశం దిరిగె,
మార్తాండుండు
కుంభీభవ త్కిరణుండయ్యె;
దిశావితానము వడంకెన్,
మిన్నదర్చెన్,
మహీంధర సంతానము
గ్రక్కునం గదలె,
నుద్భ్రాంతంబులై
యంబుధుల్ పొరలెన్
గట్టులమీద,
బిట్టు పిడుగుల్
మ్రోసెన్ మహోదగ్రతన్.

తెలుగు—తిక్కన

## ఇంద్రస్తుతి

చుట్టు ముట్టిన
పగతుఱ మట్టున బెట్ట,
సాయపడు మింద్ర!
మా వస్తు సంచయమ్ము
రక్ష సేయు మెల్లప్పుడు
రాజ్య భోగములను
సమకూర్చు
పగవారి బలము గూల్చి.

వైదికం - ఋగ్వేదం

## ఆనందములో...

విదిలించెను కేశమ్ముల,
కదలని భూధరము వోలె
కంపించెను గ్రక్కదల,
పయోధర మటు
దెస లదరెన్ గర్జించె
నంజనాత్మజు డంతన్.
నున్నని చిక్కని కేశా
చ్ఛన్నము వాలమ్ము మొదలు
సరపర లాడన్,
పన్నగపతి సర్పము బలె
తిన్నగ నాడించి యూచె

తెర తరగలుగా.
కాళ్ళతో గట్టిగా నేల
గదియ బట్టి,
చెవుల రిక్కించి,
కపికుల భవుడు హనుమ
పొంగి కుప్పించి యెగిరెను
నింగి దగుల,
వాలమును ఝుళిపించె
నవార్య బలుడు.
కరవాలము చుంబించుచు,
గిర గిర తిరుగుచును,
ముదము కిచకిచ వెట్టన్
చర చర పోవుచు, వచ్చుచు,
చరాలుమని కంబ మెక్కి
చప్పున బడుచున్ —
కోతి సాజమైన
కోతి చేష్టలు జూప
మొదలు పెట్టె
గాలి ముద్దు పట్టె.

పౌరాణికం - వాల్మీకి

## సజ్జనపద్ధతి

ఇతరుల లోని
అల్ప గుణమేని
మహా మహిమాన్వితమ్ముగా
వితతము సేయుచుందు
రొక వింతగ సజ్జను—
లౌను లెమ్ము!
మారుతము
సరోజ పత్ర కుహరోత్థిత
సౌరభమున్,
దిగంత విశ్రుత
చరితమ్ము సేయుటలు
సూచిన - నియ్యది
సాజమే యగున్.

లౌకికం - అమృతానందయోగి

## సాధనాలు

తలిరు విల్లు,
తుమ్మెదల నారి,
చెలికడగంటి చూపు తూపు,
జంట జడుడు,
ఒక, దసంగు—

డైన నూగించు లోకాలు
సాధనాలు కావు
సత్త్వ మొకటె.

— చాటువు

## వింత

నళినీ నాళ
సమాన కరమ్ములల్,
నళినీ సూన
సమాన నేత్రముల్,
కలిగియున్న నీ
రూప మ్మెలా?
లలనా! సంతా
పము కలిగించున్.

—దండి

## పొగ రేమ రి!

తామర పువ్వులు చెలి!
నీ మోమును గని
మేల మాడు ముమ్మరమ్ముగా-
జౌ మఱి!
కోశము, దండము
తామర తంపరగ గల్గ
తల పొగరు కదా!

- సాహిత్య దర్పణంలో ఉటంకితం

## అభ్యర్థన

ఇదే దాన కాల
మ్మిదే దాన పాత్ర
మ్మహో ఈశ! నీవే
మహాదాత వయ్యా!
ఇకెవ్వారి వేడన్
మహేశాన: భక్తిన్
కృపం గూర్చు వేగన్
కృతార్థుండ నౌదున్.

ఆచార్య ప్రోక్తం - శంకర భగవత్పాదులు

## సహజం

నిత్యమనుకున్న వెల్లను
నేల గలియు;
పెద్ద వనుకొన్న వెల్లను
పిదప బాయు;
ఏకముగ నున్నవానిలో
నిఱుకు పుట్టు;
పుట్టు వున్నట్టి వెల్లను
గిట్టు చుండు.

*

## నీతి

పరులు వెక్కిరించి
పరిహాస మొనరింప
తగదు సుమ్ము—
ముందు నగిన యంత
తిరిగి యేడ్వ వలయు:
నరుడిది గుర్తించి
ఒరుల గౌరవించు
టెఱుగ వలయు.

పాళి-ధమ్మపదం

## దౌర్భాగ్యం

భాగ్యదేవత
చిఱు నవ్వు బఱపు నపుడూ,
మనిషి—
నిశ్చల సంకల్ప
మహితుడగును.
భాగ్య దేవత
బొమముడి పాటుతోనె,
మనిషి చంచల కామన
మునుకు లిడును.
దౌర్భాగ్యము
పొడసూపిన

నిర్భాగ్యుని తెలివి
మాసి నెఱ్ఱెలు చీలున్;
అర్భకుని భాగ్య దే
వ్యా విర్భావమునందు
తెలివి విరవిరలాడున్.
చదువు సాము లేల?
చాతుర్య మేల?
నీ చెడు దినాల
బ్రతుకు నడచు చుండ;
ఏది చేయబోవ
నెదురగు పెద్దపు—
ల్తో, చ,
డెంత తలను
తొలుచుకున్న!

*

కుదరనివి

జగము రెండు ముక్కలుగ
నున్నదోయి;
ఆ రెండు రెండు గానె
ఉండిపోవు;
జీవితమున

విజయిసిద్ధి యొక్కటి—
మఱి సచ్చరిత్ర మన్న
జగతి యొకటి.

*

## కాలమహిమ

గాలి పాటు
చక్కగా నున్న యప్పుడు,
చెడుగు కూడ
మంచి జేయుచుండు—
ఎదురుగాలి కాల
మెదురైన యప్పుడు,
మంచి సేయ
చెడుగు మరవబాలు.

తమిళం - కురళ్

## వేగి

కోమల తామ్ర చూళికలు
క్రొవ్వెఱ సంజకు
బ్రోది పెట్ట,
నిస్సీమ కఠోర తార రుతి
జెట్టుప లార్చుచు
నట్టు లెత్తి,
విశ్రామము వోలె గూసె;

విలస చ్చరమాచల కూట
పక్కణ
గ్రామటికా కుటీర
శిఖరంబుల
గుక్కుట చక్రవాళముల్.

తెలుగు - శ్రీనాథుడు

## ప గ లు

చక్రములు పొంగె;
దస్యు సంచయు మడంగె;
దమము చెంగె;
ద్విజ ప్రతాపము జెలంగె;
సరసులం దెల్ల
గమలాతిశయ మెసంగె;
జగము విఁదగు
నినుడు తేజమున
బ్రబల!

తెలుగు - కూచిమంచి తిమ్మకవి

## ప్ర శ ం స

దేవతలకు మేలు గూర్చు
దివ్య నేత్ర సముడు సూర్యు
డుదయించుచు నున్నా డ
ల్లదిగో తూరుపు దిక్కున;

వంద యేళ్ళు చూతా మిక
వందయేళ్లు బ్రతుకుద మిక
వందయేళ్ళు మురియుద మిక
వంద యేళ్లు తనియుద మిక
వంద యేళ్ళు—ఉండా మిక
వందయేళ్లు విందా మిక
వంద యేళ్లు—అందా మిక
వంద యేళ్ళు విజయలక్ష్మి
వర్ధిల్లగ నుందా మిక;
వందలాది యేళ్ళు సూర్య
భగవానుని చూడగల్గు
వరమ్ములను పొందుద మిక.

వైదికం - తైత్తిరీయక ఆరణ్యకం

## నీ కో సం

రెక్కలు మొలవని పిల్లలు
మిక్కిలిగా తల్లి పులుగు
ప్రక్కజేరు కొన నెంతో
మక్కువ పడుచున్న యట్లు—
ఆకలి గొన్నట్టి దూడ
లావు పాలు ద్రావుటకై
ఆశతోడ మున్ముందున
కవగుళించు చున్న యట్లు—

చెలిమికాడు దూర దేశ
ములకు చనిన దిగులున, తె
న్నులు జూచుచు గూరుచున్న
కలువకంటి కలగునట్లు—
నీ కొఱకై నీ కొఱకై
నిన్ను జూచు పండుగకై
నీరజాక్షు నామనస్సు
నిరీక్షించు చున్నదోయి!

పౌరాణికం - శ్రీమద్భాగవతం

## వక్రోక్తి

ఉక్తి వైచిత్రివాక్యాల
కొనరు మురువు
గాన, వక్రోక్తిమై
జెప్పగా యతింప
వలయు, కవి;
ఉక్తి వక్రత
వనరు పడనిది—
ఏ అలంకారమైన
నింకెట్లు పొసగు.

ఆలంకారికం - భామహుడు

## యుక్తి

దాని యురోజ గంధ
పరితః పరిదిగ్ధము
ఔమ్మ్ల దాచుకోగా
నతుడౌ తెఱంగున
వగల్ వడె దేల?
అనంగ—నేది యేదీ!
నవలా! - అటంచు
దమిదీర గవుంగిట
గ్రుచ్చి యెత్తినన్:
దాన జెరంగె ముద్ర,
సుఖ తత్పరయై
మఱచెన్ లతాంగియున్.

లౌకికం - అమరుకం

## కష్టమే మఱి!

మంచు రత్నాల కంబాల
మేని నీడ
వందల కొలంది
రావణేశ్వరుల జూప,
గొలువు దీరిన
రాక్షస కువలయేశు
గష్టపడి గుర్తు బట్టెను
కపి వరుండు.

- కావ్యాదర్శం

## సమయంలో....

వెలది కోపము
దీర్ఘగ దలచి
యామె పాదముల పైని
పడనుండ భాగ్య వశత -
ఉఱుము వినబడె
నంతలో ఒక్క సారి,
నాకు నుపకార
మొనరించు నదియు వోలె.

- దండి

## ఇందుకా?

ఎన్ని పవిత్ర తీర్థముల
నేని మునింగి పునీతమైన దన్
మన్నన లేక,
నా తల సమాంతము
మర్దన జేసి వైచె,
నా చిన్నెలమారి
మైకమున, చీపురుతో
నిసి!
దీని కింతకున్

తమ్ములు కోరియూ
ధనము దండుగ సేయుట?
సిగ్గు వీడుటల్?

- అమృతానందయోగి

## అ హిం స

మానవత్వ మే మాత్ర
మైనా ఉన్నట్టి మనిషి
కౌనా! ఏ జంతువునై
నా నఱకుట, చంపుట మఱి?

పాళీ - ధమ్మపదం (చైనా అనువాదంనుంచి)

## మ గ త నం!

దొంగ నా చేతిలో నుండి
దూసుకొనియె
దండ. బలవంతముగ,
పైన బండరాళ్లు
విసురు చుండెను;
నీ వేమొ విస్తుపోయి
చూచుచుంటివి
నే చచ్చి సున్నమైతి.

ప్రాకృతం - అలంకార సంగ్రహం

## ఆవేదన

నాథుని దివ్య శోభా మయమైన
నా మధుర స్వప్నం
నాలోనే కఱగి పోయింది.
చిక్క నవుతున్న
యిక్కట్టుల మంచు తెఱలో,
చిమ్మ చీకటి పొరలో
లోకమంతా
నీరస ముద్రాంకితమై,
నిస్తబ్ధమై
నింపాదిగా జోగుతున్నది.
నేనూ నా చెలికాడూ
నెయ్యు లెవ్వరూ లేని
నిస్సహాయులమై,
నీరంధ్ర నిశా నిశ్చల
నీర ధారా పూరంలో
నెమ్మదిగా,
నెమ్మది నెమ్మదిగా
ఎక్కడికో
కొట్టుకొని పోతున్నాము.
ప్రత్యూష ద్వారబంధ—
ప్రాంగణంలో నిలిచి
పరమోచ్చైస్వరంతో

తిరుక్కోడి
పరాత్పరుని
చిరనిద్రా ముద్రనుంచి
బిరాన నిద్ర లేపితే
ఎంత బాగుండును?

తమిళం - తిరుమంగై మన్నన్

## వి భి న్న త

తనువున
విఱిగిన యమ్ములు
ననువున
బుచ్చంగవచ్చుః
నతి నిష్ఠురతన్
మనమున నాటిన
మాటలు,
వినుమెన్ని యుపాయములను
వెడలునె యధిపా!

తెలుగు - తిక్కన

## ఏ కీ భా వ ం

ఏకమై కదలండి
ఏకమై పలకండి
ఏక మానసముతో
ఏకమై తలవండి

ఏకమయ్యే దేవు
లింద్రాదులునుపూజ
లెల్ల చేకొనుచుందు
రెల్ల కాలమును.

*

మీ ఆలోచన లన్ని, స
మీకృతములు కావలయును,
మీ కార్య కలాపములు, స
మీ కృతములు కావలయును,

మీ బుద్ధియు చిత్తమ్మును
మిక్కిలి ఒక్కటి కావలె;
మీ మంత్రము మీ హవిస్సు
మిక్కిలి ఒక్కటి కావలె;
మీ లక్ష్యం మీ హృదయం
మిక్కిలి ఒక్కటి కావలె;
మీ అందరి ఐకమత్య
మెపుడు చెక్కు చెదరరాదు.

వైదికం — ఋగ్వేదం

## ఆదిత్యహృదయం

తప్త చామీకరాభుని,
తపన రూపు
విశ్వ కర్మను
చీకటి విచ్చు దొరను

లోక సాక్షిని సూర్యు
నా లోకదాయి
నంజలి ఘటించి
మ్రొక్కుచున్నాడ నేను.
భూతమ్ముల మడియించును,
భూతమ్ముల సృష్టి సేయు
భూరి కాంతులన్
భూతలము బీల్చు, పేల్చును
భూతలమును దడుపు వాన
బోరి పోరి నతడే.
క్రతువుల కాతండే
ఆ క్రతు ఫలముల కర్తడే,
వేద గణముల కతడే;
వితత ధరా మండలి
నే జతనమ్మున కైన నతడె
సర్వాధిపుడౌ.

పౌరాణికం—వాల్మీకి

మూగ భాష

కిసలయ కోమలాకృతి
బందాగుళి. నేల
భావ గర్భితముగ
వ్రాసికొనుచు,
సితలోల లోచనా
స్ఫురిత దృక్కులను

నా పయి సారె సారెకు
బఱపు కొనుచు,
చిఱు సిగ్గు మిసిమింత
తఱకల బరువున
కొంచెమ్మ్గా మోము
వంచు కొనుచు,
కాసంత పెదవులు
కంపించు చుండ
నేమియొ మాట నోటనే
మ్రింగుకొనుచు—
మీన లోచన,
ఎందుకో గాని
తనదు మానసమ్మున
నేదియో మాటుకొనుచు,
నోరు విడిచి వచింపక
నొచ్చుకొనియె,
నయ్యదియె
నాదు గుండెల
నములు చుండె,

## పాపం!

ఎంత మంచిదానవు దూ
తీ! ఎంతో మంచిదాన
వింత కంటె పాపం! నీ
వేమి సేతువ్వా?
నా కోసం గోటి గిచ్చు
లూ, కాట్లూ, పంటి గంటు
లేకముగా నోర్చుకొంటి
వెంత దానవే!

— అలంకార సంగ్రహం

## ఆశాపాశము ....

నల్లని మసితో వెన్నెల
కెల్లను చిక్కని కుంచెల
నల్లరంగు వేయు డింక;
తెల్ల గలువ నవ్వు తెఱల
నెల్ల మంత్ర తంత్రమ్ముల
కుళ్ళగించి వేయు డింక;
నల్ల బండ మీద నూఱి
చల్లని వెలుగుల తేనిని
గుల్ల చేసి వేయు డింక;
అల్లపుడే వెలది మోము
నెల్ల దెసల చూచి చూచి
చల్ల పడును నా కన్నులు.

— రాజశేఖర కవి

## వైరాగ్యం

ఇల్లాలు పిల్లలనుచును
చిల్లర కామనల తోనె
చెడుదురు మనుజుల్;
చెల్లా చెదరగు నన్నియు
చెల్లిన ప్రాయమున, మిత్తి
చిదిమిన యంతన్.
దీప మారకుండ
నోపిక గాపాడ
గ్రుడ్డివాని పనికి
గూర్చు నెట్లు?
చావ నున్న యపుడు
నీ వారు నిన్నెట్లు
కావగలరు?
వెఱ్ఱిగాక తండ్రి!
నీతి గలిగి, యొరుల
నెయ్యమ్ముతో జూచి
బాపవలయు, లోక
పాపములను;
ఇదియె జ్ఞానమన్న
నిదియె ధర్మమ్మన్న—
వట్టి కోరికలను

వదలుకొనుము.
సుఖము దుఃఖము రెండిట
సాక్షి పోక,
నిర్మమత్వమ్ముతో, పైన
నిలుచువాడె—
చావు బ్రదుకు లన్నట్టి
సంతనను దాటి
అమిత సంతోషమును
బొంద నర్హుడగును.

పాళీ—ధమ్మపదం (చైనా అనువాదం)

## మంచితనం

కర్తవ్య మెఱిగి
తమ సద్వర్తనమును
దిద్దుకొనగ
దలచెడు వారే
పూర్తిగ పెద్దలు,
వారికి కర్తవ్యమ్మన్న
మంచి కార్య మ్మొకటే.
యోగ్యులైన వారి
యోగ్యత యెల్లను
మంచి నడతలోన
మణిగి యుండు,
మిగత గుణము లెన్ని

మెఱసిన, వానికి
యోగ్య జేయు చేవ
యుండ దెపుడు.
సరివారిన్ బెరిమం
గనుం గొనుట,
తుచ్ఛ ప్రీతి లేకుంట,
ఏ పరదోషమ్ముల
జూడ కుంట,
పరితృప్తాత్మత్వముం గంట,
మాట రవంతైనను
దప్ప కుంట—
ఇవి గాటమ్మైన కంబాలు,
నీ చరితమ్మన్న
విశాల సౌధమునకున్
సద్వర్తనమ్మంతకున్.
చంపకుంట యతికి
సద్ధర్మ మగుచుండు;
నోటి నదుపులోన
నుంచుకొనుట,
సద్గుణమ్ము మంచి
సంసారి కెప్పుడు;
ఓటి మాట
లాడకోయి నరుడ!

తమిళం—కురల్

బిత్తరి

కుసుమపు గుత్తి జూచి
యొక కోమలి దగ్గఱి
కోయ బోయినన్,
బసిబడి నందు నున్న
మధుపంబులు వచ్చి
ముఖంబు తావికిన్
ముసరగ జోపి చోపి,
పెను మ్రోతలతో
నవి దట్టమైన వెక్కసపడి,
పాఱు తెంచె జెలికత్తియ లిద్దఱు
సూచి నవ్వగన్

తెలుగు — అనంతుడు

ఎక్కడి కెక్కడ?

సరసిజ గంధి పెందొడల
సాటికి రా నెదిరించి పోరు
నీ గరభము లెల్ల
జేపడగ గన్గొనియుండియు

తజ్జయార్థమై
పొరల బెనంగి, యాచవడి
పోవుట, అంతియగాక
ధాత్రిపై నరటులు
పిల్ల పిల్ల తరమైనను
సామ్యము బొంద నేర్చునే?

తెలుగు—భానుమతీ పరిణయము.

## పాపములు

అసత్యాలు పలికి పలికి
ఆర్జించిన ఆహారం—
అనుకొనియో అనుకొనకో
అరువు గొనిన ఆహారం—
అసలు కష్టపడకుండా
ఆహరించు నాహారం—
—తినుటవల్ల మూట గట్టు
కొనిన పాపరాశి నెల్ల,
అనర్హులను గొలిచి తెచ్చి
తినిన కిల్బిషము నెల్లా
అనలుడు దగ్ధ మ్మొనర్చి
అమలుని నన్ జేయుగాక.

వైదికం—తైత్తిరీయ ఆరణ్యకం

## ఆంజనేయస్తుతి

అంబోధిని గోష్పాద
మ్మున జేసిన వీర్యవంతు,
డసుర తతిని ఈగలుగా
అదిలించిన విక్రమాంకు,
డాది కావ్య మాలికలో
అలరుచున్న మాణిక్య
మ్మనిలాత్మజు డాయనకే
నభివాదన మాచరింతు.

పౌరాణికం—వాల్మీకి

## స్మితం

కఠినతర తర్క
వాక్ప్రసంగముల వలన
కావ్య నిర్వచనము
సేయ గడగు శిల్ల.—
గడ్డపాఱలు, గొడ్డండ్లు,
గదలు దెచ్చి
ముక్కు పోగు నమర్చెడు
ముచ్చటగును.

ఆలంకారికం—స్ఫుటశ్లోకం.

## జ్ఞాపకం

తురగముం చెంత చెంత
పురివిచ్చి చలించు
మయూరమున్,
ధరావరుడు
శరమ్ము వైచి యడపన్.
దలపోయక యుండె;
వెంటనే
సురత గళ ద్విబంధ మగుచున్
దెగిపోయిన పూలదండలన్
వరలు, పోలంతి వేనలి
గబాలున మానస వీథి
దోచుటన్.

లౌకికం — కాళిదాసు

## ఎందుకు?

కామన లెల్ల దీర్చుకొనగా
గలిమిం గడియింపవచ్చు,
విద్యా మహితోరు
మస్తకము లందు
బదమ్మును బెట్టవచ్చు,
సుత్రామ విభూతులం
జెలువులం దనియింపగవచ్చు,

జీవు లంతా మహిపై
జిరమ్ము మనవచ్చు—
సరే!
మఱి యెందు కింతయున్?

—సుభాషిత త్రిశతి

## ఏ మి టి ?

శాశ్వత వేదనాగ్ని కుండంలో
సతమత మవుతున్న ఓ మనిషీ!
సంతోషం ఎక్కడుంది ?
సారస్యం ఎక్కడుంది ?
కనులు కుచ్చుకున్నా, ఏ
అణువూ కన్పించని, ఈ
అనంతాంధకారంలో
అంధుడవై దుఃఖస్తూ
ఆలోకం కావాలని
అన్వేషింప వదేటికి ?
అయ్యో, అయ్యో మనిషీ !

పాళీ—ధమ్మ పదం

## ప లు కు

పలుకును బట్టియే
కలిమి 'పంటలు' పండును;
పలుకు బట్టియే
కలుగును సర్వనాశనము;

కావున నాల్కను
పట్టి యుంచగా వలయును;
నేస్తు లెల్ల
ఎడబాయని రీతి,
విరోధులైన
నీ పలుకున గుండె నిచ్చి
సెహబా సనురీతి
వచింపగా వలెన్.
దేశము నెఱింగి,
కాలమ్ము దెలిసి,
పాత్రములను గుర్తించి
తగినట్లు పలుక వలయు:
నిమ్న నగ్గల కెక్కించు
నెన్నియున్న—
కలవె పలుకును మించిన
పలుకుదోడు?
ఎదుటివారి నీ వేపు
మళ్ళించుకొనుట,
వారి మాటలలో నున్న
సారమెల్ల
ఎఱిగి పలుకుట,

ఇది వాద నియతి సుమ్మ:
తిరుగు లేనట్లు చెప్పుట
కరము ఘనము.
గందరగోళ మ్మెలుగక,
తొందరపాటున
మనస్సు తొట్రుపడక,
నీ వెందరితో వాదించిన
నందమ్మ!
నీవు చెంద
వపజయ మెపుడున్.

తమిళం — కురళ్

శివుని గని....

పగలింటి కట్టెండ
నొగిలిన కుముదిని,
సితరోచి గని
వికసిల్లు నట్లు;
వేసవి వడగాలి
నోసిన లేదీగ,
క్రొక్కారు గని
మవ్వ మెక్కునట్లు;
ఫణి విషవహ్ని

జేడ్పడి యున్న
శశిరేఖ
నెఱ విడుపున
గాంతి వఱలునట్లు;
శాపాగ్ని బడి
దివ్య సతి వంది,
శాప మోక్షము గని
నిజ కాంతి నమరునట్లు—
విరహతాప తపస్తాప
విశిఖ చయము
దాకి కందిన మేధీగ,
తత్క్షణంబ
గౌరి కాశ్మీరుడగు నీశు
గనుడు, ప్రీతి వెలమి
దొల్లింటి కంటెను
జెలువ మెసగె.

తెలుగు —నన్నెచోడుడు

## పోరు

చెప్పులోని ఱాయి,
చెవిలోని జోరీగ,
కంటిలోని నలుసు,
కాలి ముల్లు,

ఇంటిలోని పోరు
నిం తింత గాదయా
విశ్వదాభిరామ
వినుర వేమ.

— వేమన

## వ ర మి మ్ము

వాక్కులకు ప్రియుడనై
వఱలుదును గాక,
పఱగుదును గాక-వా
క్పతికి సుప్రియుడనై,
వాగ్దేవి! నాకు మధు
వద్వాక్య శీలిగా
వర మిమ్ము-నీ కిదే
వందన నివేదనము.

వైదికం-కృష్ణ యజుర్వేదం

## నీ వే కా వ లె

వద్దు నాకు నింద్ర పదవి,
వద్దు నాకు బ్రహ్మ పదవి,
వద్దు నాకు స్వారాజ్యము
వద్దు నాకు భూరాజ్యము,

వద్దు నాకు యోగవృద్ధి
వద్దు నాకు మోక్ష సిద్ధి
వ ద్దేదీ నీవు దప్ప
వరదా! కావలె నీవే!

పౌరాణికం-భాగవతం

## అ న్నీ నా ట్యం లో వే!

జ్ఞానము, శిల్పము, మరి
విజ్ఞానము, కళ,
యోగశాస్త్ర చయమును
గర్మల్,
వేనిని చూచిన—
నాట్యములోనన్
గన్పించుచుండు
లోకమ్మెల్లన్.

ఆలంకారికం-భరతుడు

## వా ర కాం త

ఎప్పు డెవనితో నుండునో
అప్పు డతని
రాగ రంజిత యగు
తన రంగు విడిచి,

వారకామిని
కేవల స్ఫటికి శిలయె
కావలయు గాక,
గాకున్న కలదె యిట్లు ?

లౌకికం-అమృతానంద యోగి

## అపథం

సరియైన దారిబట్టిన
నరునకు మృగములును
తోడు నడచుచు నుండున్,
సరిగాని దారిబట్టిన
నరునిన్ సోదరుడు గూడ
నడుమనె విడుచున్.

సంస్కృతం-మురారి

## అదే మార్పు!

వీరులకుం బ్రశస్తులు
లభించును నెల్లెడ,
మృత్యుదేవికిం
భీరువు లెల్ల చోట్ల
బలి పిల్లలై యాడురు,
గోత్రపోతులం
గూరకు నిత్యకృత్యముగ
గూల్తురు,

కాని. అవే రణావనిన్
గోరిక బోవు నప్పు
డొనగూర్తు రలంకృతు
లెన్ని యెన్నియో.

-నీలకంఠ దీక్షితులు

ము క్తి కి ....

సత్సంగత్వంతో నిస్సంగత్వం,
నిస్సంగత్వంతో
నిర్మోహత్వం,
నిర్మో హత్వంతో
నిశ్చల త త్త్వం,
నిశ్చల త త్త్వంతో
నీ నిర్వాణం—

-శంకర భగవత్పాదులు

భో జ న ప ద్ధ తి

తిను నప్పు డెల్ల
నిగ్రహమును
పాటించుటయు,
రోగముల దూరముగా

ననుపుటయు మేలు;
భోజనమును
శాంతముగా
నొనర్పబూను మెప్పుడున్

పాళీ-ధమ్మపదం

## పరాత్పరుడు

అనేక యుగాంతరాల
అనంత భావ ప్రవాహంలో
అల్లనై కొట్టుకొని పోతూ,
ఆది మధ్యాంత రహితుని
అఖండ మౌన ప్రభా
సరస్సులోనికి
అడుగు పెట్టాను.
అవాఙ్మానస గోచరుని
అనూన దర్శనంతో
ఆనంద తుందిలమైన హృదయం
ఆలాపన చేసింది:
అదు గదుగో నా నాథు డందరికీ
అధి నాథుడు.
ఆ మహాకవి కిన్నెరలో నుంచీ
అనంత సృష్టిక్రీగూ మహాకావ్యం

అవతరించింది.
ఆ మహా ప్రవక్త హృదయంలో
అణగిపోయి
అదో దృశ్యాదృశ్య
        విజ్ఞాన సర్వస్వం
అలరారు తున్నది.
ఆ పసులకాపరి కలలన్నీ
అటూ యిటూ దారితప్పి వెళ్ళే
అమాయక పశుసంతతిని గూర్చే.
ఆయన పరాత్పరుడు.

తమిళం-తిరుమఴిసై ఆళ్వార్

భీష్మస్తుతి

కుప్పించి యెగసిన
కుండలంబుల కాంతి
గగన భాగం బెల్ల
గప్పికొనగ,
ఉరికిన నోర్వక
ఉదరంబులో నున్న
జగముల వ్రేగున
జగతి గదల,
చక్రంబు చేపట్టి

చనుదెంచు రయమున
పైనున్న పచ్చని
పటము జార,
నమ్మ్రతి నాలావు
నగుబాటు సేయక
మన్నింపు మని క్రీడి
మఱల దిగువ—
గరికి లంఘించు
సింహంబు కరణి మెఱసి,
నేడు భీష్ముని జంపుదు
నిన్ను గాతు
విడువు మర్జున!
యంచు మద్విశిఖ వృష్టి
దెరలి చనుదెంచు
దేవుండు దిక్కు నాకు.

తెలుగు-పోతన

శాంతి శ్శాంతి శ్శాంతిః

భూలోకమ్మునకు శాంతి
భువోలోకమునకు శాంతి
దివ్యజలమ్ములకు శాంతి
భవ్యౌషధి తతికి శాంతి
నవ్య వనస్పతుల శాంతి
నైక దేవతలకు శాంతి;

నాకు నిఖిలదేవులెల్ల
చేకూర్తురుగాక శాంతి:
శాంతి శాంతి శాంతితోన
శాంతి మొలుచు, శాంతి విరియు
శాంతి శాంతి శాంతి శాంతి:
సర్వస్వ ప్రవృద్ధమై
జగత్తులోనున్న పాప
సహస్రాలు దారుణాలు
సకలమ్మును శాంతి రూప
సత్వస్థితి చెందుగాక.
సర్వవస్తు సంచయమ్ము
శాంతి శివంకర శంకర
సంవృతమై వెలయుగాక.

వైదికం-అథర్వవేదం

## వేగోద్ధతి

ఆకసమ్మున నతి వేగుడై
గమించు నంజనా సూను
వాల మెంతయు జెలంగె;
పులుగు రారాజు
తన్నుకపోవుచున్న
బారలకు మించినట్టి
సర్పమ్ము వోలె.

... ... ....
ఊరు వేగోత్థితమ్ములై
యుర్వీజమ్ము
లాంజనేయుని
వెన్వెంట నరిగె
కొంత తడవు,
దూర ప్రయాణమై
తరలిపోవువాని
సాగనంపెడు
బాంధవాళి వోలె,

పౌరాణికం-వాల్మీకి

వెం ట నం టి !

వెన్నెల, చందమామ
వెనువెంటనె పోవును;
మబ్బు వెంబడిన్
కన్ను మెఱుంగు జెందు
నవకమ్ముల మించు మిటారి;
లోకమం దన్నులమిన్న లెల్లను
ప్రియుంబగు భర్త్రు
పథానువర్తులే
నన్ను తెఱుంగు—
తెల్లమె కదా!
జడవస్తువులై నవానికిన్.

- కాళిదాసు

ఔ ను !

అలల రాళ్ళు రువ్వి రత్న
ముల నవమానించకు మో
జలధీ! నీ వెఱుఁగవా?
అలనా డా కౌస్తుభమ్ము
వలె నని పురుషోత్తముడే
పులిసి చేయి చాపడా?

లౌకికం-భల్లటశతకం

చే య ని ది లే దు !

పరసతి నొరుసకు
గూర్తును;
పరమర్షుల వ్రతము
భంగపఱతును త్రుటిలో;
తరుణుల కోపము
మార్తును;
సరి! నీ దయ!
నేను సేయ జాలని దేదీ?

ప్రాకృతం - అమృతానందయోగి

అ ది చూ చు కో !

మానా వమానాల
మాటల యెడల
లోకుల దృష్టి
నాలోచింప కమ్మా

ఇది సమాజమ్మ్మ కా
దిది రుద్రభూమి;
పుణ్య పాపమ్ములు
పురజన వాక్య
ములతోడ కొలువంగ
వలనుకా దెవుడు;
సత్యమున్ మృత్యు
దర్శనమున నీవు
ప్రత్యక్ష మొనరింప
ప్రయతించు మమ్మ!
జనులెంత అవమానమును
సేయ నిమ్మ!
నేను పతివ్రతనే!
నీవు, కన్నతల్లివై యుండియు
దారిని బోవు
నెవని శవమ్ముతో
నేని బంధించి,
ఏ పాప మెఱుగని
యీ పసికందు
గొంతు కోసితివేని—
ఎంతగా జనులు
నిన్ గొని యాడిన
నేమాయె గాని,

శాశ్వతమ్ముగ నీ
శ్మశానాధినాథు
నడుగుల కడ, పెద్ద
అపరాధి వోలె
పడియుండ గల
వది పరికించు కొనుము...

బెంగాలీ - రవీంద్రుని 'సతి'

## దానప్రతిగ్రహ మీమాంస

నాకమునకు నిన్ను
నడిపించునది యైన
తీసుకొనుట యెపుడు
దోస మగును;
నరకమునకు నిన్ను
తరిమివేయున దైన
దాన మిచ్చు టెపుడు
ధర్మ మగును.

తమిళం - మరక్

## కాఠిన్యం

పరగజాతి గుండు
పగుల గొట్టవచ్చు
కొండలన్ని
పిండి గొట్టవచ్చు

కఠినచిత్తు మనసు
కఱిగింప రాదయా
విశ్వదాభిరామ
వినుర వేమ.

తెలుగు - వేమన

## సం వ ర ణ స్త వం

స్వస్తి జనయిత్రికిని
స్వస్తి మా జనకునకు
స్వస్తి గో సంతతికి
స్వస్తి పురషావళికి—
మా వారలెల్ల సౌ
ఖ్యావాసులై జ్ఞాన
భావాత్ములై చిరం
జీవు లగుదురు గాక!
చిరకాల మేము సం
వరణ మూర్తిని మోద
భరితులమై కనులార
పరికించెదముగాక!

వైదికం - అథర్వ వేదం

## ఏకైకవీరుడు

దుర్దమ రాక్షస సేన చ
తుర్దశ దశ శతము
కాలితో నడచుచునే
మర్దించె నరుడు—
వైరి బలార్దను
డా రాము,
డొక్కఁగా నొక్కండే!

పౌరాణికం - వాల్మీకి

## కావ్యచ్ఛిద్రం

కావ్యమం
దల్పదోషమే గాని
యెప్పుడుండ నిమ్మని
వదిలి వేయుటకు తగదు.
సూది మొన యంత కుష్ఠువు
సోకియున్న
సుంద రాకారమెల్ల,
పాడౌందు గాదె,

ఆలంకారికం - కావ్యాదర్శం

## కావ్య గుణం

రస హానికరము లగుటన్
దోసగుల నన్నింటి
నెపుడు దొలగించ దగున్;
పస యున్నను, లేకున్నను
దోసగులు లేకుండె
ఒక్క దొడ్డ గుణమ్మౌ.

- అలంకార శేఖరం

## ఎత్తిపొడుపు

చెలుపుడు చేతులార
విరచించిన మంజరి
నీదు చెక్కిటం
గలదని పొంగి పోకుము—
అతగాని కరమ్మది
అంతరమ్మునన్
తలకి వడంకె గాక,
ముగుదా!
మరి యింకొక కుల్కులాడి—
చెక్కిలి పయిగూడ,
నీ మురువు
గీల్కొని యుండెడి నట్టిదేకదా.

లౌకికం - దశరూపకంతో ఉటంకితం

## ధూ ర్తు డు

ఒక పీటన్
చెలు లిద్ద రుంట గని
యెంతో చెలి్మ
వెన్నోనక వచ్చి
కులాసన్ వలె
నొక్కతెన్ గనులు మూసెన్;
గొంతు వక్రించి
యిం కొక తెన్
ధూర్తుడు ముద్దు వెట్టె—
చెలి చెక్కుల్
మందహాసమ్ముతో గికురింపన్,
వలపుల్ మదిన్
పులకలం గీలించి
తేలించగన్.

—అమరుకం

## మా తృ వే ద న

కుంతి :

నా నందనుడవోయి
నాయనా నీవు!

కర్ణుడు :

అశ్లైన నన్నిట్లు
లవమతి జేసి,
కులశీల గౌరవ
ముల మంటగలిపి
కన్నార తల్లిని
గాంచంగ నీక,
చిమ్మ చీకటి దిమ్మ
గ్రమ్మిన లోక
మధ్యమ్మునకు, దూర
మందుండి బార
వైచితివేల తల్లీ!
చెప్పు మింక?
ఏల నన్నిన్ని నా
ళ్ళీ యవజ్ఞా ప్ర
వాహమ్మునఁ ద్రోసి
వైచితి వేల?
తో బుట్టువుల నుండి
దూరమ్ము జేసి
పార్థుని నన్ను వే
ర్పరచితి వెట్లు?

ఆ శైశవమ్మున
నారంభమై అ
దృశ్య నిగూఢ ప
టిష్ఠ పాశమ్ము
లేవో, రాక్షస రూప
మెత్తి, మమ్మొద్ద
రను దుర్నిరోధ స
ర్వాకర్షణముల
లాగివేసినవి త
లా ఒకదెసకు ....

.... ... .... ....

అమ్మ జవా బివ్వవా?
నీదు సిగ్గు
చిమ్మ చీకటి పొరల్
చీల్చుక వచ్చి
నా ప్రతి యంగమ్ము
నంటుచు నుండె,
నీరవ స్థగతమై;
నేత్రముల్ మూసి
వేయుచున్నది ...

40)

ఉండనీ యటులైన,
ఏల నన్నిట్లు త్యా
జించి వేసితివో
వచియింప వద్దులే!
వసుధపై జనని
వాత్సల్య మది
బ్రహ్మ వరముల లోన
ప్ర ప్రథమమ్మ.
ఆ భవ్య ధనమ్మ
నాత్మజునుండి
ఏలా హరించితివో —
వివరించ లేవేని
విడువుము.

కాని,

చెప్పి తీరవలయు;
మరల నన్నిప్పు డో
మాత! నీ యంక
మునకు గైగొని పోప
మన సేల కలిగె?

కుంతి:

నీ నింద వజ్ర సం
తాన సమాన

మై కొడుకా! గుండె
నవియించె వేయి
వ్రక్కలు గాగ—నిన్
వరించినట్టి
పాపమ్ము వలననే,
పంచ పాండవుల
నక్కున జేర్చి—ఆ
హ్లాదింప దగియు,
నా హృదయమ్ము సం
తాన విహీన
మన వయ్యె—నా చేతు
లెనసి నీ కొరకు
సకల లోకముల నెల్ల
గాలించు కొనుచు
వంచితలై భ్రమి
యించుచు నుండె.
నిన్ను వంచించిన
నేరమ్ము వలన
నా గుండె దివ్వెయై
నవయుచు, నాత్మ

దాహమ్ముతో జగ
ద్ధాత్రికి విచ్చు
చుండె నివాళి నో
శూర మూర్ధన్య!
అబ్బ! నేటికి ధన్యు
రాలైతి నిన్ను
కన్నులారగ చూడ
గల్గితి నయ్య!
నోట మాటే రాని
నాటనే నీకు
అపరాధ మొనరించి
నాను—ఆనోట
నే దుష్టురాలిని
నీ తల్లి నిపుడు
మన్నించినా నన్ను
మాట రానిమ్ము—
ఆ మాట నింద క
న్నా తీవ్రమగుచు,
నంతరమ్మున దవా
నలము రగిల్చి,

నా పాతకముల పూ
ర్ణమ్ముగ దగ్ధ
మొనరించి నన్ పవి
త్రను సేయుగాక.

బెంగాలీ - రవీంద్రుని "కర్ణకుంతి" పద్యనాటిక

## దానమనగా ....

తిరిగి యివ్వలేని
నరునికి నిచ్చుటే
దాన మర్మమాటతోను జెల్లు;
ఏదికోరి దానమిచ్చిన, నదియెల్ల
అప్పుగాని, దాన
మగుట యెట్లు?

తమిళం—కురల్

## వానకాళులు

ధర, నిదాఘ వాతాహతి
నెరియకుండ,
విధి, దమాల మంటపము
గావించె ననగ నొప్పె,
నీలాభ్ర పటల, మచ్చప్పరమున,
రాళు లన నెల్ల దెస
వానకాళు లమరె.

తెలుగు—నన్నెచోడుడు

స త్య వ్య క్తి

స్వర్ణ పాత్రమ్ముతో
సంఛన్నమై యుండె
సత్య పదనము దైవమా!
సత్య దృష్టిని నాకు
సమకూర్చు కొఱకు నా
చ్ఛాదనము తొలగించుమా!

వైదికం - ఈశావాస్యల్

ఊ పు

భూ నభోం తరాళమ్మును
పూనికతో చేత, దివియ
బూనిన తెఱగున కపివరు
డూని యెగిరెనూ—
వాని విభీషణ ఘోషణ
తో నాకస మర్క సహిత
మై, నెత్తెలు చీలి వ్రక్క
లౌనట్లుండెన్.

పౌరాణికం - వాల్మీకి

## వృద్ధాప్యం

అత నద్దమ్మున నొక్కనాడు,
తన యాస్యమ్మున్ విలోకించి,
వృద్ధత యే తెంచిన చాయ
కేశముల శ్వేతత్వము సూచింప,
నాతత నీహార పరీత
ఫుల్ల జల జాతమ్మున్
విడంబించు మోము—
అతు లావేదన ముంప,
నెంచుకొనె
ప్రాయ మ్మిచ్చు సౌందర్యమున్.
చలువ వెన్నెల
తామరసమ్ము, దాకి
వాడిపో జేయు లీల,
నీ వార్ధకమ్ము—
మనిషి కున్నట్టి
సౌందర్య మహిమ రీతి
నెల్ల మాడిచి
మసి జేయు టింత నిజము.
దారుణ మారణ దంష్ట్రా
కారణ ధావళ్యమో!
ఘోర కర్కశ క్రోధా

భీల కాల హాసనమో!
ఈ రాక్షస వృద్ధాప్య వి
భా రజతా భోగము.
ఒంటె వగల నా నడువ
నోపికతో నుండవచ్చు;
గాడిద గానమ్ము సేయ
గా జూచి సహించవచ్చు;
కాని, ముసలివాని రాగ
కలన జూచి నవ్వు నాపు
కో నేర్చుట సాధ్యముకా
దే నరునకునూ.

లౌకికం - క్షేమేంద్రుడు

సుభాషితం

యోగాలు, యజ్ఞాలు
సాగించు వేదనల
మోగించు గుండె నె
న్నొ గతుల బాలు—
నీ గండముల దాటి
పోగోరు దేని, ధ
ర్మా గతుడవగుము; మత
రాగ ముక్తుడ వగుము.

పాళీ—ధమ్మపదం

## దొరకాదు

పాలితుల నణచి,
యసమానాలయము
నొనర్చి నేల,
నాలుగు చెఱగుల్,
పాలింప బూను రాజును
దూలింపుము
హంతకుండు
దొర యెట్టులగున్.

తమిళం - కురళ్

## అంచ

మందిర మరవిందము,
బిసమందమ-భోజనము,
శయన మంబుజ దళముల్,
హిందోళ తరగ
లిక నేమందు___
మరాళమ్మ సేయు
నట్టి తపమ్ముల్.

సంస్కృతం - అమృతానందయోగి

## ప్రేమాగ్ని

నాలో రగిలే మాలిమి
వాలాయము
నన్నుజంప బాల్పడ దేలా?
జేలా! వీవన గాలుల
జ్వాలలు చెలరేగి
మాడ్చి చావ వేటికే?

ప్రాకృతం - అలంకార సంగ్రహం

## భాషాభిమానం

అంగో పాంగములందు
సుందరత, నిత్యస్ఫూర్తి
జెన్నొందుతన్;
రంగుల్ జూపుత
వ్యంగ్య భాగ్యములతో;
రాణించుతన్ పాదముల్
సింగారమ్ముల
మావి తీపుల;
సఖీ సీమన్
మహాత్త్వమ్ముతో
పొంగుంగావుత,
మార్జరీ మధువచో

భోగ ప్రభా భోగముల్.
అమర వచస్తతి
కేయుత్తమ పదము
నొసంగినా మొ—
తత్ స్థితి,
గుజరాతము పొందు గాక;
దివ్యత్వము చెందును గాక
హరి కృపా వీక్షణలన్.

గుజరాతి - ప్రేమానంద

## సతి

పతి సంతు మోసితి
పడసితి గొమరు,
బలిమిని లొంగి
పోవగ లేదు నేను.
ఔను! జ్ఞప్తికి వచ్చె
నా నాటి రేయి,
గుట్టుగా నొకచెలి
పట్టు మటంచు-
రెండు జాబులు నిచ్చె:
ఒండున నీవు
'వానిని పొడిచి
చంపవలె' నన్నావు:

'విసము పంపితి—
త్రాగి వేయు' మటంచు
మా తల్లి వ్రాసెను.
మఱి నా సతీత్వ
మెవరో—
బలాత్కారమే చేసి
చౌర్య మొనరించియే యున్నచో,
మాత పితల
మాట ఆనాడే
పాటించియే యుందు.
అదికాదు జరిగినది—
ఆ వీరవరుని,
ప్రేమించి భర్తగా
స్వీకరించితిని.
బ్రాహ్మణ యవన
విభాగ మెవ్వరిది?
ధర్మమ్మునకు లేదు
తద్ భేద దృష్టి:
అంతరమందు
సత్యాత్మ యెచ్చోట
చరించు నచట
నందరు నొక్కవారె,
అయిన నొక్కొక్క యపు

డాదిమ కాల సంస్కార
మెగబడి, చర చరలాడి
నరము నరమ్మ
ఘృణా దగ్ధమొంది
చలియించిపోవునట్టులు
చేయుచుండు.
కాని, వానిని
సతీ ఘన ధర్మ మిపుడు
నిర్జించి వైచె;
నే నీతితో పతిని,
నారాధానము
సేసినాను;
మతాంతరమ్మ
మనః పూర్వకమ్మగ గొంటి.
పతితను కాను;
నే పరితాపపడుచు,
పరిభవ వ్యగ్రనై.
శిరమెత్త లేక
అపరాధి వలె
భిన్నమైన ధర్మమ్మ
సేవింప లే నింక,
సేవింప లేను.

బెంగాలీ - రవీంద్రుని ఏకాంకిక 'సతి'

## ప్రబోధం

జ్ఞానిసలారా మీరు
మానిసులు కాలేరు;
మీ నిత్యాత్మకోసం
పూని తపస్సు చెయ్యలేరు;
ఏనాటినుంచో మేము
దీనావనుని సేవకులము;
ఏ నలుపూ మమ్మంటదు
మానితులే రండి మా జంటకు.

తమిళ - పెరియాళ్వార్

## మోహలత

క్రకచ ధారా కఠోరంబైన
కత్తుల క్రొవ్వాడి
కొడవంట గోయరాదు;
క్రూరా యసోద్దామ
కుద్దాలముల క్రవ్వి
వేళ్ళతో పెకలించి వేయరాదు;
సమిధాజ్యముల
నగ్ని సమకొల్పి
దారుణ శిఖల గాలిచి,
నీఱు సేయరాదు;
ఘన ముష్టి గబళించి,

కవట లుద్ధతిబట్టి తెగ జేతితోడ
రా దీయరాదు:
హృదయ మను పాదు లోపల
నుదయ మంది,
తల్లి దండ్రులమీాద సోదరులమీాద
దనయబంధు
కళత్ర మిత్రకుల మీాద
మూరి బోవంగ బ్రాకిన
మోహ లతను.

తెలుగు - పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

## అభ్యర్థన

మధురమైన వానినే
మరి మరి మనన మ్మొనర్తు,
మధురమైన వానినే
మరి మరి సృజనమ్మొనర్తు.
మధురమైన వానినే
మరి మరి వినికిడి నొనర్తు,
మధురమైన వానినే
మరి మరి వాచన మొనర్తు,
సురులకు నరులకు మధురో
త్కర సంయుతి గూర్చు మధుర

తర వాక్కు వచించునట్లు
వర మిత్రురు గాక దేవ
వరులు, తథాస్తని దీవన
గురిపింతురు గాక పితలు.

వైదికం - కృష్ణయజుర్వేద సంహిత

## మనస్సమం

అకట! గభీర నీర
నివహామ్ముల,
నిర్జర ఘోర
కానన ప్రకరములన్
ప్రవిష్టుడగు;
పర్వత పంక్తుల
సంచరించు—
పూలకు నయి
బుద్ధి హీనుడు;
హాలాహల ధారణ!
నీకు నాత్మ
హృద్వికచ జలేజ
మొక్కటి,
నివేదన చేసి
సుఖింప డెందుకో?

లౌకికం - శంకరాచార్య

కుటి నొకరైన
లేమి గని,
గొంకుచు మెల్లన
బాన్పు డిగ్గి,
చిక్కటి నిదురన్
నటించు చెలికాని
గనన్ దమి తీవరింపగా,
బటువగు
ముద్దు వెట్టుకొని,
వాని కపోలము
పుల్కలెత్తినన్
దటుకున మోము వాల్చు
మెలతన్,
ప్రియు డూరిచె
ముద్దు సోనలన్.

—అమరుకం

# ధర్మ విచికిత్స

పండితుల మధ్యముననే
యుండిన,
మూర్ఖునకు
ధర్మ మొకటి

42)

తెలియునా?
కుండం గల
పులుసుననే
యుండిన,
గరిటెకును
రుచి యెదో
యెటు తెలియున్.
తెలివి గలవాడు
పండిత కులమున
కొకసారి వచ్చి
కూర్చుండిన చాల్ —
కల ధర్మ మెల్ల
నెఱుగన్ —
తెలియును రుచి
ఒక్క చుక్కనే
నాలుకకున్.
మతిహీను డైనవానికి,
వెతనే కల్పించుచుండు
వితరణ కూడా;
గతి తప్పి చేయు
త్యాగము,

మతి నటు మీాదట
గలంచి,
మూడ్చును గాదా?

పాళీ - ధమ్మపదం

తె లి య క....

పడతి చెక్కిలి
చంద్ర బింబమ్మ వోలునంచు
గోడ్డ దాటుగ
వచియించు చంద్రుః
తత్వ పరిశీలనము
సేయ—తరుణి ఏడ?
పాప మనిపించు
నా నెల బాలు డేడ?

ప్రాకృతం-గాథ

ని స్పృ హ

చెలియ వానికై
ఎదురు చూపులను
జూచి చూచి
అక్కట!
కన్నులు వాచిపోయె;
గోడ గురుతుల
రోజులు

కూడి కూడి
ఇట్టె వ్రేళ్ళల్లి
సమసి పోయినవి గదవె!
నా మేని మిసిమి
యంతయు
మాసిపోయినది:
లేమ!
బంగరు మురుగు
లెల్ల పడి పోయినవి;
ఏమి కాగల దింక!
యీ రోజు మఱచితే నేమి?
జ్ఞాపక మున్న నేమి?
ఒకటే కదా!

తమిళం - కురళ్

# అనురాగబంధం

పొమ్మన జూచు,
చూచి మది బుట్టిన
ప్రేమము పేర్మి
బాష్పముల్ గ్రమ్మిన,
గ్రమ్మఱం
బెడమొగం బడి
కన్నుల నీరు గ్రింగుచున్
గ్రమ్మఱ దా

శకుంతుల మొగంబగు,
నశ్రుల నించు
గొంత సేపమ్మౌని
జాలి బొందిః
ధృతి యంతయు
నిల్వక విచ్చి పాఱగన్.
ఎంచ మునీంద్రు లందు
విజతేంద్రియుఁడైన
తపస్వి,
కూర్మి గావించి
శకుంతలం బెనిచి,
విస్మృతి నొందిన
మోహపాశముల్
త్రెంచుకొనంగ లేక,
తరి తీపుల
చిత్తము గాసివెట్టె,
శీలించిన
నెవ్వఁ డింక
వదలింపగ నోపెడు
మోహ బంధముల్.

—తెలుగు

ఆ స్థితి

మంగళప్రదమైన వానినె
మనము విందాము.
మంగళప్రదమైన వానినె
మనము చూతాము
సత్యసంపన్నాంగములతో
సంతసింతాము.
స్వర్హితాయుర్దాయముల జీ
వనము సేతాము.

వైదికం - ఋగ్వేదం

మండోదరి మనోవ్యధ

దానవుల కెల్ల రాజు
మా తండ్రి,
భర్త అసుర
లోకమంతటికి
రాజాధిరాజు,
దేవపతిని నిర్జించిన
దిట్ట కొడుకు___
నాకు తక్కువేమని
మిన్ను దాకుచుంటి.
పొగరెక్కిన పగతుల

పెం పగలిచి,
మగటిమిని జాటినట్టి
తెంపఱుల్ —
నగధీరుల నావారని
దిగు లన్నది లేక
హాయి దేలుచు నుంటిన్.
బ్రతికి నన్నాళ్లు బ్రతికి,
యీ గతి
వితంతు వగుదునంచు
దలంపగనైతి;
దూరదృష్టి లేమిని
రానున్న కష్ట నష్టములను
గ్రహియింప నేరక
మోసపడితి.

పౌరాణికం - వాల్మీకి

## మరులూ - మావ

మొలిచె, పల్లవించె,
మొగ్గలు దొడిగెను,
పూవు పూసె —
గున్నమావిచెట్టు;
మొలిచె, పల్లవించె,
మొగ్గలు దొడిగెను,

పూవు పూసె నెడద
పొలతి మరులు.

లౌకికం - ముక్తకం

## స త్య మ హ త్త్వ ం

ఒక్కమాట చాలు
నొక్కింత తెలిసిన,
ఎఱుకవడనిమాట
లేల వేయి?
సత్య మొకటి తెలిసి
చక్కగా నడిచిన జాలు
ముక్తి పొంద జాలునరుడు.

పాళీ - ధమ్మపదం

## కా ల ం

ఒకరికి విషమయమగు;
నింకొకరికి నమృతమ్ము;
రెండు నొక్కరి కగు;
నే యొకరికో
అమృతమ్మును గా,
దిక విషముం గాదు
కాల, మే మనవచ్చున్.

ప్రాకృతం - గాథ